ఓమ్ తత్ సత్.

# గృహస్థాశ్రమతత్వము.

(శ్రీ రామతీర్థస్వామి ప్రణీతము)

అనువాదకులు:

శ్రీ తత్వానందస్వాములు.



శ్రీ వ్యాసాశ్రమము తరఫున ప్రకటితము.

నాల్గవకూర్పు 2000 ప్రతులు.

1952

శ్రీ వేదవ్యాస ముద్రాక్షరశాల, చిత్తూరు.

 [దీనివెల 0-6-0

వలయువారు: మేనేజరు, శ్రీ వ్యాసాశ్రమము,
ఏర్పేడు పోస్టు, (చిత్తూరు జి

## ప్రశ్నోత్తర మాణిక్యమాల.

ప్రశ్నోత్తర మాణిక్యమాల యను నీ దివ్యగ్రంథమ మాణిక్యములవంటి ప్రశ్నోత్తరములచే కూర్చబడినదగుట దీనికి సార్థకనామధేయము పెట్టబడినది. ఇదివరలో విరచితములగు గ్రంథములచే తీరని సందేహములుండిన దీనివలన నవినివృత్తి కాగలవు. అంతేగాక ఇదివరలోనుండు గ్రంథములయందు నెక్కువ శాస్త్రప్రమాణములగు ఉపనిషద్వాక్యములుండుటచే శాస్త్రపఠనములేనివారికి అర్థమగుట కొంత ప్రయాసముగానుండును. ఇదియో అటువంటిదికాదు. కేవలము సులభభాషలో వచనరూపముగానుండుటచే విద్యలేని ముముక్షువులకుగూడ వేదాంతసారము గోచరముకాగలదు. [దీనివెల 2-0-0.

## బుద్ధచర్య.

ఇందులో శ్రీబుద్ధభగవానునిగురించి గ్రహించవలసిన విషయములనన్నింటిని సంగ్రహించి వ్రాయుడమైనది. బౌద్ధగ్రంథములెన్ని గలవో అన్నిటి సారమిదియే. శ్రీబుద్ధభగవానుడు ఏల భూలోకమున నవతరించవలయును? అచటనుండి పరినిర్వాణము వరకు గల సర్వవిషయములున్ను, బుద్ధదేవుని సర్వోపదేశములున్ను, సర్వసాధనములున్ను, దీనిలో చూడగలరు. వెల 5-0-0

## నారద భక్తిసూత్రములు.

తెనుగున ఇంతవిపులముగా ఇదివరలో నెవరున్ను ...ండలేదు. భక్తియొకటియే ముక్తికి సాధనమని శ్రీనారద ...శయము. ఇతరములగు యోగ, తప, వేదాన్త విచార ... ముక్తిని గలుగజేయును. [వెల 2-0-0

శ్రీ సనాతన గ్రంథమాల. ప్రసూనము ౧

# గృహస్థాశ్రమతత్త్వము.



"గృహస్థజీవనము మోక్షమునకు ప్రతిబంధకము కాకపోగా తక్కుంగల ఆశ్రమములకు అన్నిటికిని అవలంబనము ఒసగునదై ధన్యమై వెలయగలదు."

1952

వలయువారు: మేనేజరు, శ్రీ వ్యాసాశ్రమము,
యేర్పేడు పోస్టు, (చిత్తూరు జిల్లా.)

# చతుర్థముద్రణమునకు

## పీఠిక.

---

ఈ గ్రంథరాజము చిన్నదయ్యును అమూల్యమగు గ్రంథము. ప్రతి పురుషుడును, ప్రతి స్త్రీయు, ప్రతి బాలుడును, బాలికయు కూడ పఠించవలసిన గ్రంథము. గృహస్థధర్మము క్షుద్రమైనదనియు, సంసార విషసాగరమున బడి కొట్టుకొనుచే దీనికి గమ్యముగాని తరించు నదుపాయము ఇందు దొరకదనియు పలువురు తలంచుచున్నారు. మరియు సంన్యాసము శ్రేష్ఠమనియు, అందు ప్రవేశించి ఒక్కసారి సామాన్య సంసార చిహ్నములను పో విడిచినయెడల ఈ లోకమున సుఖజీవనమును పరమున ముక్తియు లభించునని భ్రమ పడుచున్నారు. గృహస్థుడు విధ్యుక్తసత్కర్మల నాచరించి తత్కర్మ ఫలత్యాగముచేసి తరించగలడు. సంన్యాసి సకలకామ్యకర్మల త్యజించి తరించును. అంతియే భేదము. ఒకటి మరొకదానికన్న మిన్నయని భ్రమపడి, గుణకర్మ స్వభావముచేత ఒకదానియందుండ అర్హులగువారు తమ ఆశ్రమమును వీడ తగదు.

ఒకరాజు గృహస్థధర్మము శ్రేష్ఠమా? సంన్యాసము శ్రేష్ఠమా? అనుసమస్యను తేల్చుటకు పూనుకొనెను. అందుల కొక వింతమార్గమును అవలంబించినాడు. గృహస్థజీవనము శ్రేష్ఠమని రుజువుచేయజాలని సంసారులనెల్ల బలాత్కరించి సంన్యాసుల చేయుచు, సంన్యాసము శ్రేష్ఠమని రుజువు చేయజాలని సన్న్యాసులకెల్ల పెండ్లిండ్లు చేసి సంసారమున పడ

వేయుచు నుండెను. తుదకొక సంన్యాసి వీని సమస్యా పరిష్కారము చేయ నొడంబడి, బ్రాహ్మణవేషము వేయించి రాజును తనతో దీసికొనిపోయెను.

ఒకానొక నగరమున రాకొమరితె స్వయంవర మహోత్సవము జరుగుచుండ అచటికి ఈ యిరువురును పోయిరి. వీరికి దాపుగనే ఒక సుందరాకారుడగు యౌవన సంన్యాసి నిలిచి ఉత్సవమును తిలకించుచుండెను. రాకొమరితె దగద్ధగ మెఱయు నలంకారములతోవచ్చి, రాకొమరులను రాజులను వరుసగా చూచి ఎవరిని వరించదయ్యెను. తుదకు దూరమునుండి తొంగిచూచుచున్న యువక సంన్యాసి కంఠమున పూలమాలిక వేసెను. అతడు దానినితీసి విసరి నేల వేసి పారిపోవుచుండెను. రాజు ఈ సంన్యాసి వేదవాదు గాన తన కొమరితను పెండ్లాడ వెఱచి పోవుచుండెనని తలచి, తత్క్షణమే తన రాజ్యమున సగభాగమును, తన అనంతరము మిగత సగమును ఇచ్చెదనని కేకలు వేయసాగెను. సంన్యాసి ఈ మాటలను వినియు నరకునేయుక వెళ్లిపోవుచుండెను. రాకొమరితె తాను వరించినవాడే తనభర్త అని వానివెంట పర్విడిపోవుచుండెను.

సమస్యా పరిష్కారమునకు పూనుకొనిన రాజును సంన్యాసియు వారివెంటబడి పోయిరి. ముందుబోవు సంన్యాసి ఒక అడవిలో చాల దూరము పోయి పోయి, వెంటవచ్చు రాకొమరితను గాంచి తప్పించుకొన నెంచి, పొదలలో దూరి కనబడకుండ పోయెను. వెనుకవచ్చు రాజును సంన్యాసియు రాకొమరితెను కలిసికొనిరి. సాయంసమయము దాటి చీకటి

పడసాగెను. ఉదయమున మార్గము చూచుకొని అడవినుండి బయట పడవచ్చునని ఒక చెట్టుక్రింద మువ్వురును పరుండిరి.

ఆ చెట్టుమీద ఒక పక్షి గూడున్నది. అందొక మగ పక్షియు ఒక ఆడపక్షియు కాపురముండెను. వానితోడ రెండు చిన్న పక్షికూన లున్నవి. మగపక్షి చెట్టుక్రింద నున్న వారిని తన భార్యకు చూపి "ఈ అతిథులు చలిచే బాధపడు చున్నారు. నేను ఎక్కడికైన పోయి కొంచెము నిప్పును తెచ్చెదను" అని ఎగిరిపోయెను. కొంతసేపటికి కాలుచున్న పుడకను ఒకదానిని తెచ్చి చెట్టుక్రింద పడవేసెను. ఆ అతి థులు దాని సహాయమున చలిమంట వేసికొని చుట్టును కూర్చుండిరి. మగపక్షి మరల నిట్లనెను; "వీరికి ఆకలి దీర్చుటకు మనయింట యేమియులేదు. నేను మంటలో పడె దను. నా మాంసమును వీరు తిని తృప్తులయ్యెదరుగాక" ఇట్లు అనుచునే అది మంటలో పడెను. ఆడుపక్షి "నా మగని త్యాగమువలన అతిథులకు చాలినంత ఆహారము దొరకుట లేదు. భర్త ప్రారంభించిన ధర్మమును భార్య పూర్తిగావింప వలెగదా? అదియే సహధర్మచారిణీత్వము" అనుచు అదియు మంటలో పడినది. ఇక గూటియందున్న పక్షిపిల్లలు "మన తల్లిదండ్రులు తమధర్మనిర్వాహణమునకై శరీరత్యాగముచేసిరి. మనకు మార్గదర్శకులైరి. జననీజనకులు ప్రారంభించిన యీ మహాయజ్ఞము అసంపూర్ణముగ నున్నది. రెండుపక్షుల మాంసము ముగ్గురికి చాలదు. మన మాంసమును అందు చేర్చుదముగాక. అది మన ధర్మము" అనుచు అవియు మంటలో పడినవి.

రాజును తోడ్కొనివచ్చిన సంన్యాసి వానితో నిట్లనెను: “చూచితివా! ఆ యౌవన సంన్యాసి, సర్వాభరణ సంశోభిత యగు సుందరియు రాజ్యవైభవమును తన పాలబడినను, ఆశ గొనక విరాగియై వెడలిపోయినాడు. ఈ పక్షిరాజములు ప్రాణములనైనను త్యాగముచేసి గృహస్థధర్మమును నిర్వహించినవి. ఇందును అందునుకూడ స్వార్థచింతగాని భోగలాలసగాని లేదు. నిర్మల వైరాగ్యముతో కూడిన గృహస్థుడు సంన్యాసికి సమానుడే. పారమార్థికముగ నిరువురి ధర్మములును సమానములే. మోక్షప్రదములే. కాబట్టి నీవు సంసారిగా నుండ గోరుదువేని, ఆ పక్షులవలె నిష్కాముడవై జీవించుము. లేదా సంన్యాసి కాగోరెదవా, ఆ యువక సంన్యాసి వలె దేనికిని ఆశగొనక పూర్ణవిరాగివై యుండుము.”

గృహస్థ సన్న్యాసములు రెండును సమానమని వింటిమి గదా! ఇక యీ గ్రంథమున గృహస్థధర్మ తత్వమును తెలియుదముగాక.

---

## ఐదవకూర్పునకు పీఠిక.

కొలదికాలములోనే ఐదవ ముద్రణము అవశ్యకమగుటచేత, ఆంధ్ర సోదరులు యీ గ్రంథమును యెట్లాదరించుచున్నారో, తేట తెల్లమే. కావున వేఱొక పీఠిక అనవసరము. ఇంకను కొన్ని విషయములు అనుబంధమున చేర్చి పాఠకులకు మరింత లాభకరముగా గ్రంథమును వృద్ధిచేయుచున్నారము. ఇంతే మా మనవి.

మేనేజరు.

# గృహస్థాశ్రమతత్వము.



వేదాంతశాస్త్రము పరివ్రాజకులకును సన్న్యాసులకును కంటె గృహస్థులకే ముఖ్యముగ ఉపయోగకరము; హిమాలయములలో ముక్కు మూసికొని కూర్చుండు ఏ విరాగుల కొఱకో యేర్పడినదని తలంపరాదు. వేదాంతశాస్త్రము గృహస్థుల కొఱకే ఉద్దేశింపబడియున్నది.

ప్రతి గృహమునందును భర్త భార్యను సంతోషపెట్టవలయుననియు, భార్య భర్తను సంతోషపెట్టవలయుననియు, చాలసదుద్దేశముతోడనే ప్రయత్నించుచుందురు; కాని ఫలమెట్లున్నది? ఇరువురును ఒండొరులను అధోగతికి లాగుకొని పోవుచున్నారు. ఇందు నేరము ఎవరిది? వారి అభిమతమున దోషమున్నదా? లేదు. అంతకును కారణము వారి అజ్ఞానమే సుడీ. ఒండొరులకు ఏది శ్రేయోదాయకమో వారికి తెలియదు. అందువలననే కష్టములు దుఃఖములు గల్గుచున్నవి.

ఒండొరులు తుచ్ఛవిషయవాంఛలతో సంతృప్తిచెందుటకై ప్రయత్నించుటవలన, పరస్పరము సుఖపెట్టుకొనగలమని నరులు తలంచుచుందురు. ఒకడు మఱొకని ఆడంబరమునకు తోడ్పడినయెడల తాను వానికి మహోపకారము చేసినటుల ఎంచుకొనుచుండును. ఇట్టి పరోపకారభావమునకు అజ్ఞానమే ఆధారము. ముందు అటువంటి అజ్ఞానమును తొలగించవలయును. అప్పుడు ప్రతిగృహమును ఆనందనిలయమై వెలుంగగలదు. సంసారము స్వర్గనివాసము కాగలదు.

మనము భగవంతునిగాని, ప్రకృతినిగాని మారునటుల చేయలేము అని జ్ఞప్తి నుంచుకొనవలయును. మనము ఆత్మ జ్ఞానోన్నతిని పొందవలయుననుట ప్రకృతిశాసనము. అది భగవంతుని సంకల్పమునై యున్నది. ఈ ప్రపంచమున జరుగు లోపములన్నియు, మఱియు లౌకికవ్యవహారదక్షత యావత్తును, మనలోని ప్రతివాడును తన దైవాంశమును గుర్తించి, భగవంతునితో ఏకీభావమును పొంది, వానిలో ఐక్యమగుట కొఱకే తిన్నని మార్గముననే నడచుచున్నవి. ఎన్నిబాధలైన పడి ప్రతివాడును వేదాంతి కాక తప్పదు.

కత్తిని అగ్నిహోత్రమును చూపి బాధించి అనగా హింసించి వేదాంతమును బోధించు అవసరములేదు. ప్రకృతి ధర్మములు అన్నియు సైనిక గణములీల నున్నవి. భగవంతుని యీ బలగములు నిన్ను సదా ఆత్మసాక్షాత్కారమునకై త్రోసికొనిపోవుచునే యుండును. నీవు పోక తప్పను. నీపొరుగువాని క్షేమము ఎందున్నదో నీవు గ్రహించినయెడల నీవు ప్రకృతి ధర్మమునకు అనుగుణ్యముగ వర్తించగలవు. ప్రతి యిల్లును, ప్రతి చెఱసాల సయితము అప్పుడు స్వర్గనిలయముగ మారిపోగలదు.

ప్రకృతిధర్మానుగుణ్యముగ నిజమగు శుభము, భగవంతునితో నీ ఐక్యతను సాక్షాత్కారమునకు దెచ్చుకొనుట లోనేయున్నది. నీ శుభమనగా నీవు మోక్షమును పొందుటయే; నీవు సర్వాత్మయు, సర్వశక్తిమయుడును, అనంతుడును అగు భగవంతుడవే అని అపరోక్షానుభవము పొందుటయేమోక్షము. అపరోక్షానుభవమునకు పరమావధి నీవు భగవంతునితో ఐక్యమందుటే. "నేను వీని కొడుకును, వాని తండ్రిని" అను

నిట్టి భావములన్నియు స్వప్నప్రాయములై, నిన్ను విడచిపోవలయును. అప్పుడు నీ దైవాంశ ప్రత్యక్షానుభవమునకు రాగలదు.

నీదుఃఖములకు, నీ పరితాపములకు కారణము తెలుపవలసినయెడల, నీవు బ్రహ్మసాక్షాత్కారమును పొందుటకై ప్రకృతి నిన్ను త్రోసికొని పోవుచుండుటయే అని తెలిపిన చాలును. గమ్యమును చేరకపోవుటే దుఃఖమునకు కారణము. పైకిపోయి గమ్యమును చేరితివా యిక నీకు పాపము అంటదు. నీవు సమస్తమునకు అతీతుడవై వెలుంగుదువు. నీవు పరిపూర్ణుడవగుదువు; నీవు బ్రహ్మమే అగుదువు.

అపరోక్షానుభవము ఒక్కగంటలో వచ్చునది కాదు. కాలపరిపాకము అత్యవసరము. ఈశరీరము యిప్పటి పరిణామావస్థకు వచ్చుటకు లక్షలకొలది వత్సరములు గడిచియుండును. గతకాలములో ఒకప్పుడు నీవొక మొక్కవై యుంటివి. మఱొకప్పుడు ఆఫ్రికాలో సిద్దీవై యుండియుందువు. వేఱొకప్పుడు నీవు వేఱొకజాతివాడవు, వేఱొక దేశీయుడవునై యుండియుండి, యిప్పటి కీదశకు వచ్చితివి.

ఒక గృహమును ఊడదీయుటకును కాలము అనునది అవసరము, కాని గృహముకట్టుటకు పట్టునంతకాలము విప్పుటకు అవసరముండదు, నీకడ తుపాకీమందు ఉన్నయెడల సత్వరము దానిని పచ్ఛిన్నము చేయవచ్చును. కాని చాలమందికి ఈ తుపాకిమందు దొరకదు అనవచ్చును.

నీవు నీభార్యతోడను నీబిడ్డలతోడను కాపురము చేయుచు, నీవు ఈ తత్వమును అపరోక్షానుభవమునకు తెచ్చికొంటివేని నీబుద్ధిబలముచేతనే నీవు మారిపోదువు; నీకు ముక్తి అలవడును. నీకు ఇక జన్మాంతర బాధ యుండదు. భగవంతుని

చేరుటకై నీవు ఈజన్మములో యోగములను అన్నింటిని సాధన చేయవలసిన అవసరముండదు.

కొందఱు భక్తిచేత ముక్తి చేకూరుననియు, మఱి కొందఱు కర్మచేతనే ముక్తి సాధ్యమనియు చెప్పుచుందురు.

కేవలము కర్మవలన ముక్తిలేదు. కేవలము భక్తివలనను ముక్తిలేదు. ఆత్మయందు భక్తియుండి, నీ కర్మలద్వారా ఆచరణచేసినగాని ముక్తి దొఱకదు. ఈ రెండిటిచేతను నీ ఆత్మను తెలిసికొంటివా, ఆక్షణముననే నీవు ముక్తుడవు అగుచున్నావు.

జ్ఞానము రెండు మార్గములఁ గల్గుచున్నది; బుద్ధి ద్వారమునను భావద్వారమునను గలుగుచున్నది. భావనా ద్వారమున భగవంతుని సాక్షాత్కారమునకు తెచ్చికొనినను జ్ఞానమే యగుచున్నది. ఈ జ్ఞానము అవసరమే. దీనికి వెఱచి పారిపోతివా నీకు పరితాపము తప్పదు.

మన సంసారములలో సామాన్యముగ జరుగునది ఏమి? భార్యాభర్తలు ఇరువురును ముక్తిఁబొందు నిమిత్తము, అఖండ సత్యజ్ఞానమును పొందుటకొఱకు, పరస్పరము సాహాయ్యము జేసికొనవలసియుండును. అటులచేయుచు, భర్తకు నిజమైనభక్తి గలిగి సత్యజ్ఞానము అమరునటుల వర్తించుటలో భార్య తోడ్పడెనేని ఆమె వానికి మోక్షమార్గమును చూపు గురువే అగుచున్నది. అటులనే భార్యకు తోడ్పడు భర్త ఆమెకు మోక్ష మార్గమును చూపు గురువు అగుచున్నాడు. ఇప్పటి దుస్థితి యెట్లున్నది? భార్యను రౌరవాది నరకములకీడ్చు పిశాచము వలె భర్తయు, భర్తను అధోలోకములకు అణగద్రొక్కు పెనుభూతమువలె భార్యయు మెలగుచున్నారు.

నీ అజ్ఞానమే నిన్ను అధోగతికి లాగుచున్నది. కుటుంబ ధర్మములలో నీకు భంగపాటు తెచ్చునది ఏదియును లేదు. భార్య పిశాచమై వర్తించుచున్నది. భర్తను ఏ యిరువది రూప్యములకో దానిసయగునటుల బలాత్కరించుచున్నది. ఏవో నాలుగు తళుకుబెళుకు నగలను ఆడంబర వేషములను ఆశించి, తన ఆత్మను నాశము చేసికొనుచున్నది. భర్తయు అటులనే వర్తించుచున్నాడు. భార్యను తనకంటె వేఱగు ఒకవ్యక్తిగా చూచుచున్నాడు. భార్య వేత్రై తనకుగాను నియమితమైన భోగవస్తువుగా నెంచుచున్నాడు. భార్యయు భర్తనుగూర్చి అటులనే తలచుచున్నది. అందువలననే సకలదుఃఖములును వాటిల్లుచున్నవి. భార్య భర్తను దానిసగా జేయుచున్నది. భర్త భార్యను దానిసగా జేయుచున్నాడు.

నీవు ఒక దున్నపోతునకు త్రాడుగట్టి లాగుచుండిన యెడల, నీవు దానిని లాగిపట్టునంతకాలము అదియు నిన్ను లాగిపట్టుచున్నట్లే అగును. భౌతిక సంపదలన్నియు నిట్టివే. వానిని నీవు లాగిపట్టుచున్నావు; అవియు నిన్ను లాగిపట్టుచునే యున్నవి. సంపదలకై పెనగులాడు తుచ్ఛవాంఛల విడిచి, సదా ఇతరుల ఆస్తిని ఆశించు నీచస్వార్థమును త్యజించి, పరోపకార చింత కలిగి, దాతృభావముతో వర్తించు నెడల ప్రతి గృహమును స్వర్గమై ఒప్పగలదు.

భార్యయు భర్తయు యిరువురును ఒండొరుల శుభమునకై పాటుపడవలయును. నాకు ఇది ఇమ్ము అది తెమ్ము అనిగాక, నాకిది చేసిపెట్టుము అదిచేసిపెట్టుము అనిగాని కోరుచుండు బుద్ధిని మానినయెడల సమస్తమును సిద్ధించగలదు. స్వర్గమే నీ అరచేతిలో నుండగలదు.

ఈ వస్తువును తెచ్చిపెట్టుము, ఆవస్తువును చేసిపెట్టుము అని నీవు అడుగుచున్నావు. సరే, దానిని తెచ్చియిచ్చును. అది వినియోగమైపోగానే నీకు దానిపైని మఱల కోర్కె కలుగుచునేయున్నది. కోరిక అనునది రోగమువంటిది. పూర్తిగ నిర్మూలముకానియెడల అది సదా తిరుగబెట్టుచునేయుండును.

నీవు కోరుకొను వస్తువు దొరికినప్పుడు ఆనందము కలిగెనుగదా అనవచ్చును. ఎంత పరితాపము, ఎంత తనుకులాట వినపిమ్మటనోగదా ఆ స్వల్పానందము వచ్చుట? పోనీ, ఆ ఆనందము వచ్చిన పిమ్మట ఎంతకాలము నిలవగలదు? కొద్ది కాలములోనె మటుమాయమై పోవుచున్నదే!

ప్రతిఫలముకోరక నీవు ఏమిచేసినను, ఏమి ఇచ్చినను నీకు ఆనందము కలుగుచున్నది. ఆ పరోపకారభావములోనే ఆనందమున్నది. ఒకరియొద్దనుండి తీసికొంటినను భావమువలన కలుగు ఆనందము క్షణభంగురము; మఱియు అది దుఃఖకారణము. నీ ఆనందమును 'పుచ్చుకొనుటలో' ఉంచక, 'ఇచ్చుటయందు' నిలుపుము. ఇచ్చుటవలన కలుగు ఆనందము స్థిరస్థాయి. నీవు ఒకనికి చేసిన దానమును స్మరించి సతతము ఆనందమును పొందగలవు. నీకు ఒకరిచ్చినదానినిగూర్చి నీవు చిరకాలము సంతోషమును నిలుపుకొనజాలవు. నీవు ఒక దేవాలయమునకు ధర్మమును ఇచ్చితివి అనుకొనుము. నీకు అది శాశ్వతముగా సంతోషమును ఒసగుచున్నది. నీకు ఒకడు ఏనుగును దానముచేయును. నీవు సంతోషింతువు; దాతను స్తుతింతువు; కొలదికాలములోనే "ఈ ఏనుగు నాదే" అను భావన స్థిరముగ నీహృదయమున నాటుకొనును. ఎన్నడోగాని దాతను స్మరింపవు. ఆ దానమును గూర్చిన ఆనందము నీ హృదయము

నుండి త్నోలోనే జారిపోవుట నిశ్చయము. కావున ఎన్నడ లను నీవు దాతగానే ఉండుటకు యత్నించుము; ఎన్నడును స్వీక ర్తగా అనగా పుచ్చుకొనువాడవుగా ఉండజూడకుము.

భార్యాభర్తలు ఇరువురును తనులో ఎవరికి ఎవరు ఏమి ఇతురా అని దేవ్వరించుచు చూచుచుండక, సతతము పరోపకార పారీణత గలిగి, దాతలుగానుండుటే గృహస్థులు ఆనందమును పొందగల రహస్యము. అప్పుడిరువురును సౌఖ్యము ననుభవించగలరు.

సరియే. దేని ఇచ్చుట? దానమునకు అర్హ వస్తువేది? భార్యగాని భర్తగాని సాధ్యమైనంతవఱకును తాను జ్ఞాన దానము చేయుచుండవలయును. జ్ఞానమే దానార్హ పదార్థము. నీవు భార్యవైనయెడల నీ భర్తను, నీవు భర్తవైనయెడల నీ భార్యను, పవిత్రవంతముగ ఒనర్పజాలినప్పుడే నీ ధర్మమును నీవు నిర్వహించినట్లగును. అది విధ్యుక్తమార్గమును అగును.

పూర్వము ఒక రాజు కలడు. ఆయన బ్రహ్మజ్ఞానమును సాధనచేయ నెంచెను; అందుకొఱకై అతడు గృహస్థాశ్రమమును విసర్జించుట అవసరమని తలంచెను.

భార్య ఎంతగా ప్రయత్నించినను అతడు ఆమెబోధను వినడయ్యెను. ఆమె మాటనే అతడు సరకుచేయలేదు.

అతడు రాజ్యమును త్యజించి, భార్యకు రాజ్యపాలనా భారమును ఒప్పగించి హిమాలయ పర్వతమున కేగెను. ఒక సంవత్సరము గడచినది.

ఈలోపుగా రాణి భర్తకు శాశ్వతానందమును చేకూర్చు ఉపాయముంగూర్చి విచారింపసాగెను ఒకనాడు ఆమెసన్న్యాసి వేషమునుదాల్చి, భర్తయున్న పర్ణశాలను సమీపించెను.

ఆయన ధ్యానాయత్త చిత్తుడై యుండగాంచి ఆయనకండ్లు దెఱచు వఱకును ప్రక్కను నిలిచియుండెను. ఆమెను ఒక గొప్ప సన్న్యాసిగానెంచి ఆ రాజు ఆమెకు పూజ లర్పించెను.

ఆమెకు తన్మయావస్థ గలిగినది. (దివ్యజ్ఞానముతో నిండినది.) "స్వామీ! నన్నుద్ధరించుటకై మిత్తము అవతరించిన భగవదవతారమనియే భావించుచున్నాను." అని రాజు పలుక ఆమె "ఔనుఔను" అనెను. అంతట రాజు తనకు జ్ఞానోపదేశము చేయుడని కోరెను. వారు యిట్టుల ప్రసంగించిరి:

రాణి—ఓరాజా! నీవు ప్రపూర్ణానందమును అనుభవింప కోరుదువేని, నీవు సర్వపరిత్యాగము గావించవలసి యుండును.

రాజు—(ఆశ్చర్యముంజూపుచు) నేను నా రాజ్యమును నా భార్యను, నా బిడ్డలను పరిత్యజించియే యున్నాను!

రాణి—నీవేమియు త్యజించలేదు. విరాగివి కాలేదు.

రాజు—(ఏమియు గ్రహింపజాలక) నేను నా రాజ్యమును వీడలేదా? నా కుటుంబమును విడచి రాలేదా? అయినను నేను విరాగిని కానా?

రాణి—లేదు లేదు. నీకు ఇంకను ఏమియులేదా?

రాజు—అవును. నాకు ఈపర్ణశాల ఉన్నది; ఈదండము ఈ కమండలములున్నవి.

రాణి—కావున నీవు విరాగివికావు. నీకు ఏమేని ఉన్నంత కాలమును నీవు దానివాడవే అయిపోదువు. నీకు స్వతంత్రిత లేదు. క్రియయు, ప్రతిక్రియయు, పరస్పరము అభిముఖములై (ఒకదానికి ఒకటి ఎదురై) వర్తించును. నీవొకదానిని 'నాది' అనుదువేని, అదియు 'నీవు నా వాడవు' అనుచుండును.

అంత ఆరాజు గుడిసెను తగులబెట్టినాడు. దండకమండలములను నదిలో పారవేసినాడు.

రాజు—ఇప్పుడో నేను విరాగిని కానా?

రాణి—ఈవస్తువులను పారవేసినంతమాత్రాన వైరాగ్యము లభించదు. రాజా! నీవు పర్ణశాలను తగులబెట్టివేసితివి. కాని నీకు ఇంకను మూడుమూరలన్నర మృద్దేహము (శరీరము) లేదా? ఊరక ఆ వస్తువులను నాశము చేసితివే! అది తప్పు! అందువలన నీకు చేకూరిన మేలులేదు. అప్పుడు నీకున్నది ఇప్పుడును ఉన్నది. ఈ మూడు మూరలన్నర రేగడిల్లు నిలిచియే యున్నదిగదా!

అంతట రాజు తన శరీరమును దగులబెట్టివేయు ఉంకించెను. ఒక చితిని చేర్చి, నిప్పును రగులజేసెను. ఆ అగ్నిలో దుముకుటకు సిద్ధపడెను. భార్య వానిని అడ్డగించి, యిట్లుప్రశ్నించినది:

రాణి—ఓరాజా! నీశరీరమును దహనముచేసిన వెనుక ఏమియు మిగులదా?

రాజు—బూడిద మిగులును.

రాణి—ఎవరి బూడిద?

రాజు—నా బూడిదయే.

రాణి—అటులైనచో నీకు అప్పుడును బూడిద మిగిలి యుంటున్నది. కాబట్టి నిశరీరమును తగులబెట్టియు నీవు విరాగివి కాజాలకుందువు.

రాజు—అటులైనయెడల నేను విరాగిని అగుట ఎట్లు? నేను ఏమి త్యజించవలసియున్నది?

రాణి—రాజా! ఇదెవరి శరీరము?

రాజు—నా శరీరమే.

రాణి—సరే, దానిని త్యజించుము. అందున్న మనస్సు ఎవరిది?

రాజు—నా మనస్సే.

రాణి—అటులైన, దానిని పరిత్యజించుము.

రాణి యీతీరున రాజును విచారణశీలునిగా జేసి, ప్రశ్నలను అడుగునటులను, తానే వానికి సమాధానము చెప్పు నటులను చేసినది. తుదకు ఆయన యిట్లు తలపోయసాగెను:-

"నేను అనగా ఎవరు? నేను 'మనస్సును' గాక, అదియు నాదే ఐనచో, నేను యింకను వేఱై యుండవలయును! నేను శరీరము కాదు; మనస్సునకును అతీతముగనే నేనున్నాను."

తుదకు ఆయన "నేను దేవ దేవుడనే; సర్వేశ్వరుడను; పరిపూర్ణుడను; శాశ్వతబ్రహ్మమును!" అని భావించెను. ఇతర పదార్థములను అన్నింటిని పరిత్యాగము చేసినను ఈ పరిపూర్ణ శాశ్వతబ్రహ్మమును త్యాగముచేయ వీలుపడునదికాదని ఆ రాజు తెలిసికొనెను. "తన్నువదలిన ధర్మములేదు" అందురు. 'త్యాగము మనకు అత్యంతము ప్రియములగు వస్తువులతో ప్రారంభము కావలసియున్నది. 'అహం' అను భ్రాంతినే నేను విడువవలసియున్నది! 'నేను ఇది చేయుచున్నాను; నేను దానికి కర్తను; నేను భోక్తను' అనునిట్టి అహంభావమును పెంచు తలంపులను నేను విడిచివేయవలయును. ఇట్టి భావనలనుగూర్చి మననము చేయవలయును. వానికి ఋజువులు, నిదర్శనములు అవసరములు కావు. నా భార్య, నా శరీరము, నా బిడ్డలు, నా బూడిద, నా మనస్సు, నా బుద్ధి అను భావములు అదృశ్యములై పోవలయును. ఈ సంకల్పములు రహితమైన గాని అపరోక్షానుభూతి అలవడజాలదు.'

నీవు అడవులకు పోవచ్చును. అయినను నీవు విరాగివి కాకపోవచ్చును. ఇదియో అదియో నీదను భ్రాంతి నిలిచియే యుండును. బైరాగులందఱును ఇటువంటి తలపులను ఎల్లెడల విడినవారు కారు. కొందఱు రాజులు సుందరహర్మ్యములందు వసింపుచును ఇట్టి భావములను త్యజింపజాలిరి.

"మమకార" భావములతో గూడిన సంకుచితాత్మను త్యజింపజాలినవాడే విరాగి కాగలడు. నేను దీనిని చేయుచున్నాను, నేను దానిని చేయుచున్నాను; ఇదనాది అదినాది అను భావములు కలవాడు ఎన్నడైనను విరాగి అనిపించుకొనగలడా? లేడు. ఈ ప్రపంచమునకు స్వామియై, రక్షకుడై, పరిపాలకుడై వెలయు అనంతుడనే నేను అను సత్యమును గుర్తించి అపరోక్షానుభవమును సంపాదించుకొనునప్పుడు సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, వాయువు, జలము అన్నియు భగవంతుని ప్రత్యక్షస్వరూపములే అగుటంజేసి, అవియెల్ల తానే యైనట్లు అతడు భావింపగలడు.

ఆ రాజు ఇట్లు జిజ్ఞాసాపరుడై జ్ఞానియగుటకు రాణితో డ్పడుచు కొంతకాలమటనుండెను. ఒకనాడు ఆమె తన మారువేషము తొలగించివేసి రాజుయెదుటికి వచ్చెను. తాను పాతివ్రత్యభంగమును కావించినటుల పలికి, తన్ను మన్నింపుమని రాజును వేడుకొనెను. ఆమె యిట్లనెను—"రాజా, నన్ను క్షమింపుము. నేను పాతకిని; నేను నిన్ను మోసగించితిని. నన్ను మన్నింపుము. నా ప్రార్థన ఆలకింపుము." రాజిట్లనెను: "యువతీ! ఈ క్షమాపణలు ఏల? ఈ ప్రార్థనలకు అర్థమేమి? నేను ఈ శరీరమను అని నమ్మునెడల, అనగా నన్ను అజ్ఞానము ప్రేరేపించునేని, నేను ఈ శరీరమునకు స్వామిని అని విశ్వసించునట్ల

యినచో, నీవు నాస్వీయవని భావించునెడలను నీవర్తనము నాకు బాధకరముగనే ఉండియుండును. నాకటువంటి యీషణమున్న యెడల, నేను స్వామ్యములను నిలిపిపెట్టుకొను స్వభావముతో నుంటినేని, అట్టి జాడ్యము నన్ను పట్టుకొనియున్నచో నేను కంటగించుకొని యుండెడివాడనే; నాకు దుఃఖము కలిగెడిదే! కాని యిప్పుడు ఈ శరీరములో 'భర్త' అను భావములేదు. నా చేతులతో నేను ఎట్టి త్రాళ్ళను పట్టుకొనియుండలేదు. నాది అనునది ఏదియునులేదు. నేను ఎవరివాడను కాను. నేను అఖండ పరిపూర్ణుడను. ఇట్లు నీవును స్మరింపుము. ధ్యానాయత్తపుకమ్ము. ఓ బాలా! నీవు పవిత్రురాలవు కాగలవు. ఈలోకములో అప వితృలగు బాలికలు ఎందరోకలరు. వారును నావారే. జగత్ప్ర కాశకుడనగు నేను ఈ ప్రపంచమునకు అంతకును స్వామిని; నేను ఎవరిని నిందించగలను? దేనితో ప్రీతుడను కాగలను?"

నీ పొరుగుననున్న ఆడుది దుష్కార్యము చేసినయెడల నీకు దుఃఖములేదు. నీభార్య దుష్కార్యము చేసినయెడల, అబ్బో! నీకు తగనివిచారము కలుగుచున్నది! మమకారపూరిత మైన, 'నాది నాది' అను భావమునకు ఫలమే యిదంతయును.

రాణి తన రాజ్యమునకు వెడలిపోయి, కొలదికాలము ననే రాజునొద్దకు తిరిగివచ్చి యిట్లనెను: "ఓరాజా! నీవు సాక్షా త్తు భగవంతుడవే అగుదువు. నీవు ఎక్కడనున్న ఏమిభేదము? నీ సౌధములకంటె ఈ హిమాలయములు నీవి కాగలవా?

రాజు—నేను సర్వత్ర నున్నాను. అన్ని శరీరములును నాయవిసే. ఇతరశరీరములను మించి ఈశరీరము ఎక్కువగా నాది కాజాలదు! జ్ఞానదృష్టికి ఈశరీరము కాన్పించదు. సత్య

మును గ్రహింపజాలనివారికే యిది కాన్పించుచుండును. అని రాజుపలికెను.

తదనంతరము రాణి రాజును తిరిగి రాజ్యములోనికి తీసికొని పోయినటుల కథ తెలుపుచున్నది. ఆతడు సమస్తమును అశాశ్వతమను అగూఢజ్ఞానముతో, ఇంద్రియములచే మోసపోక, యింద్రియములకు దాసుడు కాకుండ, సమస్తవైభవముల నడుమను ఇరువదియైదు సంవత్సరములు వాసముచేసినాడు. అతడప్పుడెట్లున్నాడు? ఆతడు రాజు కాడు! చక్రవర్తి కాడు! సాక్షాత్తు భగవంతుడే!—వైరాగ్యము అనగా ఇటువంటిది!

నిక్కమగు విరాగికి గులకరాళ్ళును, నవరత్నములును, ముండ్లకంపలు, పట్టుపరుపులు, రాజప్రాసాదములు, పేదల గుడిసెలును సమములై కాన్పించును.

ప్రజలు సామాన్యముగా "ఇది నాకకు, అది నాకకు; మమకారము విడువుము. ద్వేషము అసూయ వ...ని తాల్పకుము" అని చులకనగా పలుకుచుందురు. కాని వైరాగ్యము అనునది ఆత్మసాక్షాత్కారమునకు నిచ్చెనవంటి సాధన మాత్రమే. నిజమగు ఆత్మజ్ఞానముతో దైవత్వము ననుభవించునప్పుడుమాత్రమే వైరాగ్యము ప్రాప్తించగలదు. కృత్రిమపు వైరాగ్యమున న ప్రయోజనముండదు. బలాత్కారపు త్యాగము నిష్ఫలము. పైకథలో రాణియొక్క సాహాయ్యమున చక్రవర్తి బ్రహ్మసాక్షాత్కారమును పొందజాలినాడని గ్రహించితిమి. వివాహమాడినచో భార్యాభర్తలు ఆవిధమున నుండవలయును; అటుల ఒండొరులు సాహాయ్యము చేసికొనునెడల, తమగృహమును స్వర్గముగ ఒనర్పజాలుదురు ముక్తి పడయజాలుదురు. హృదయమున మమత్వము వదలనిది,

కేవల సంసారత్యాగము వైరాగ్యము అనబడదు. దానివలన ఫలము ఇసుమంతయు లేదు. సక్రమముగ నడిపినయెడల గృహస్థ ధర్మము వైరాగ్యమునకు అంతరాయమును కల్పించకపోవుటే గాక, వైరాగ్యసాధనయందు క్రమశిక్షణమై మహోపకారము చేయగలదు.

భార్యతోడను, బిడ్డలతోడను, బంధు మిత్రాదులతోడను గృహస్థధర్మమును నడుపు పురుషుడు, అనగా లోకములోని సామాన్యజనుడు సత్యతత్వమును తెలిసికొనగలడా? వానికి ఆత్మజ్ఞానము అలవడునా? ఆతడు బ్రహ్మవిదుడు కాగలునా? వానికి ముక్తి చేకూరుట సాధ్యమా? అను సమస్యను ఇంకొక పక్షమునుండి విచారింతము.

"కత్తి నీశత్రుసంహారమునకు ఉపకరించునా?" అని అడిగినచో నీవేమందువు? ఈప్రశ్నకు జవాబుగా "ఔను" అందువేని అదేవిధముగా "గృహస్థుడు బ్రహ్మసిద్ధి పొందగలడా?" అను ప్రశ్నకు 'ఔను' అను జవాబును ఈయవచ్చును. ఆ కత్తి యొక్కయు కుటుంబ బాంధవ్యములయొక్కయు వినియోగ మార్గమును అనుసరించి జవాబుండును. పరుల దాడినుండి మనలను రక్షించుటకును, శత్రుసంహారమునకును ఉపయోగపడునట్టి ఆకత్తియే, మనము ఆత్మహత్య గావించుకొనుటకును వినియోగపడగలదు. అదేరీతిని గృహస్థజీవనము సద్వినియోగము చేసికొనినయెడల, మన ఆత్మోద్ధరణకును బ్రహ్మజ్ఞానసాధనకును ఆధారము కాగలదు. మఱి ఆ గృహస్థజీవనమే వక్రమార్గమును బట్టినయెడల, మనల నాత్మోన్నతికి దూరులంచేసి నధోగతిని బడద్రోయగలదు.

వ్యాయామములు, క్రీడలు మొదలగునవి మనకు ఆరోగ్యమునొసగి ఆనందమును సమకూర్చుటకొఱకే గదా! వానిని సక్రమముగా నుపయోగించుకొంటిమేని వానివలన ఉపకారమును పొందుచున్నాము; దేహబలము, పారిశుద్ధ్యత లభించుచున్నది; ఉత్సాహోన్నతి కలుగుచున్నది.

ఆ వ్యాయామములనే ఆ క్రీడలనే, దుర్వినియోగము చేసినయెడల మనకు ఉపకారము లేకపోగా అపకారములు సంభవించుచున్నవి. అలసట, విసుగు, చీకాకు జనింపగలవు. కండరములు భిన్నములు కాగలవు. నాడులు భగ్నములు కాగలవు. రోగములు ఎన్నోని కలుగగలవు. ఇదేవిధముగా సంసారసంబంధములు మనము తరించుటకు సులభసాధనములు కాగలవు, ఇతరులను తరింపజేయుటకును సాధనములు కాగలవు. లేదా వానివలననే కీడుమూడగలదు. మనము నాశము కాగలము. అన్యులకు ఎన్నెని విధముల ఘోరానర్థముల తెచ్చిపెట్టగలము. ఫలములు సాధనములను అనుసరించుటకంటె, ఆ సాధనముల వినియోగముపైని ఆధారపడి యుండును.

ఒక బుద్ధిమంతునియొద్ద సేవకుడొకడు ఉండెడివాడు. ఆసేవకుడు పరమమూర్ఖుడు. దుష్టుడుకూడనై యుండెను. అతడేది చేసినను కుటిలమార్గముననే జేసెడివాడు. యజమానుడు ఒకటి చెప్పిన తానొకటి చేసెడివాడు. అవిధేయుడను వానిది పెట్టినపేరు. ఈసేవకుని వర్తనము జూచినయెడల యెంతశాంతవంతునికైనను ఆగ్రహము పుట్టకుండుట అసంభవము. కాని సాధుమూర్తియగు వాని యజమానుడుమాత్రము ఎన్నడును ఆగ్రహించకుండెను. విసిగికొనడు; రిచ్చపడడు; మఱియు ఈ

సేవకుని సంతోషపెట్టుటకే సదా ప్రయత్నించుచుండును. ఇట్లుండ వాని యింటికి పలువురు అతిథులు వచ్చిరి. వారియెడ ఈసేవకుని వర్తనము అసహ్యముగనుండెను. ఆ అతిథులలో ఒకడు వీని వర్తనమును చూచి భరింపజాలక, ఈవిషయమును యజమానునికి తెలుపుటకై, వానినిగూర్చి యజమానునితో కఠినముగ మాట్లాడెను. వానిచేష్టల జూచి ఆ అతిథి మిగుల నొచ్చుకొని, వెగటుజెంది, వానిని వెంటనే తొలగించివేయుమని యజమానునితో చెప్పెను. యజమానుడిట్లనెను: "నీ సలహా చాలమంచిదే. బహు సదుద్దేశముతో నుడివితివి; నీవు నామేలు కోరుచున్నావనుట లెస్సము. నీవు నా పనులు నా వ్యవహారములు ప్రవర్ధనము కాగోరుచు, అందుకొఱకే యీ సలహా నొసంగుచున్నాడవు; నాపనులు పాడగుచున్నవనియు, నావ్యవహారము నాశమగుచుండెననియు నేను నీకంటె బాగుగ నెఱుగుదును. ముఖ్యముగా ఆ హేతువుచేతనే, అనగా ఈసేవకుడు విశ్వాసఘాతకుడుగా నున్నాడు కావుననే, వానిని నేను పెట్టుకొన్నాను. వాని దుశ్చేష్టలును వాని దుష్ప్రవర్తనమును ముఖ్యముగా నాకు ఆతడు ప్రియుడగుటకు కారణములుసుమీ! వాడు పాపాత్ముడును, దుష్టుడును, విశ్వాసఘాతకుడును అగు సేవకుడు కావుననే నేను వానిని ఇంతగా ప్రేమించుచున్నాను." ఈ వాగ్ధోరణి మిగుల విచిత్రముగా నున్నది.

ఆ యజమానుడు మరియు నిట్లనెను: "ఈ ప్రపంచములో అనగా నేనెఱిగినంతవట్టుకు వీడు ఒక్కడే నాయెడ అవిధేయుడై వర్తించువాడు; వీడొక్కడే అప్రాచ్యములును, అప్రతిష్ఠకరములును, కడుసష్టదాయకములును అగు పనుల జేయువాడు. నాకు పరిసక్తిగలంతవట్టుకు యితరులందఱును చాల

సాధువులుగను, ఆనందకరులుగను, ప్రీతికరులుగను నుందురు. వారెవరును నాకు అప్రియ మొనరింపజాలరు; కావున ఈతడు అందఱివంటివాడు కాడు; అసామాన్యుడు, నాకువీడుఒకవిధమగు సాముగ ముద్గరవంటివాడు; నా పారమార్థిక జీవనమునకు ఒక ప్రత్యేక సాధనము. మానవులు తమ కండరములకు పరిశ్రమ గల్గించి దేహబలమును వృద్ధిగావించుకొనుటకై ముద్గరలను లోడీలను బరువులను ఉపయోగించుకొను విధాన, నా ఆధ్యాత్మిక శరీరము దృఢపడునిమిత్తము ఈసేవకుడు నాకు ముద్గరలీలను, లోడీలవలెను ఉపయోగపడుచున్నాడు. ఈసేవకుని ద్వారమున నాకు బలోన్నతి కల్గుచున్నది. ఈసేవకునితో తప్పక పెనగులాడవలసి వచ్చుచున్నది. అందుమూలమున నాకు బలము వృద్ధియగుచున్నది."

మీ కుటుంబబంధములు మీకు అంతరాయములుగను, అవరోధములుగను కాన్పించునెడల చీకాకు పడకుడు. ఈ సాధుమూర్తియగు యజమానునిరీతిని వర్తింపుడు. ఆకష్టములను, నిరోధములను మీకు బలమును సామర్థ్యమును ఒసగురీతిని ఉపయోగించుకొనుడు.

సోక్రటీసునకు ఒకభార్య యుండెడిది. ప్రపంచములో అంతప్రతికూలురాలు యింకొకరుండ ఉండజాలదు. ఒకనాడు ఆతడు దీర్ఘాలోచనాయుతుడై కూర్చున్నతఱిని ఎప్పటియట్ల ఆమె వానికడకువచ్చి అసహ్యపు కఠినోక్తులాడసాగెను. ఆమె వానిని గద్దించినది; ఈసడించినది; తన మాటాలకించుమని రెట్టించినది. ఏదో యీపని ఆపని చేయుమని గద్దరించినది. కాని సోక్రటీసు తన తత్త్వవిచారముననే మునిగి యుండెను.

క్రొత్తసమస్య యేదేని వాని మనస్సునకు తగిలినప్పుడు దానిని పరిష్కరించువఱకును విడువకుండుట వాని స్వభావము.

భార్య రంకెలు వేసినది, బొబ్బరింతలు పెట్టినది. కాని ఆతడు వినుపించుకొనలేదు. అంతట ఆమె కోపావేశమున పరవశయై కలయంపినీళ్లు తెచ్చి భర్తనెత్తిమీద పోసినది. సోక్రటీసు అప్పుడైనను వికలుడై వెగటుచూపెనా? ఎంతమాత్రమును లేదు. అతడు మందహాసముచేసి, నవ్వి "తఱచుగా ఉరుములు ఉరిమినప్పుడు వానకురియదు. కాని అప్పుడును వానకురియునని యీనాడు రుజువైనది" అనెను.

ఆమె ఉరిమినప్పుడెల్ల వాన కురిసెడిదిగాదు; కాని యీనాడు ఆమె ఉరిమినది; వానయు వచ్చినది. ఇట్లు శాంతముగ పలికి ఆతడు మఱల తన తత్వవిచారణనే సాగించినాడు.

జనులు తమ యుద్రేకమును ఎటుల అడంచుకొనగలుగుటాయని నిరాశావశులు కాదగదు. సోక్రటీసను ఒక్కమానవుడు తన చిత్తసంయమము చేయుగల్గినయెడల అందఱును చేయగలరు! ఈనాడు సైతము మనోనిగ్రహము గలవారును, స్వభావమును మరల్చుకొనజాలినవారును కాన్పించుట లేదా? నిక్కముగా అటువంటివారు కలరు. ప్రయత్నించినచో మీరును అటుల చేయజాలుదురు సుమీ.

సత్యదర్శనమునకును, మీలోని దైవాంశను తెలిసికొనుటకును, సర్వాత్మునితోడ మీ ఐక్యతను గ్రహించుటకును, అఖిల జగముతోడను ఐక్యభావమును కుదుర్చుకొనుటకును, ఆత్మసాక్షాత్కారానుభవమును పొందుటకును మీరు అవలంబింపవలయు మార్గముంగూర్చి ఆలోచించుకొంటిరా? కుటుంబ బంధుత్వములద్వారముననే అది సుగమ్యము కాగలదు సుడీ!

ప్రపంచములో ఎల్లరి సంకల్పమును, ఎల్లరి గమ్యార్థమును ప్రకృతిపరిణామపరమావధియును, సర్వాంతర్యామియై వెలుంగు బ్రహ్మమును అందఱును సాక్షాత్కారమునకు తెచ్చుకొనుచేసుడీ! క్షుద్రమగు జీవాత్మ తాను భగవంతునితో ఐక్యభావమును పొంది, పరమాత్మ తత్త్వముతోడ సమ్మిశ్రితమై పోవుటకును పూర్ణమగు అనుభవమును సంపాదించుకొనుటే పరమగమ్యము. కఠినదండనలకు లోనయ్యును ఆ బ్రహ్మసాక్షాత్కారమును అందఱును సంపాదించుకొనవలసినదే.

అదియే పరమావధి. సామాన్యనరునకు కుటుంబసంబంధములు అవరోధములుగ తోచవచ్చును; కాని భార్యయు, బిడ్డలును నీకు సహకారులేసుమ్మని రామతీర్థుడు పలుకుచున్నాడు.

భూమి సూర్యునిచుట్టు ప్రదక్షిణము చేయుచున్నది. భూమి తిరుగక తప్పదు. చంద్రమండలము భూమిని అంటియుండగోరుచున్నది. భూమిచేయువలసినదేమి? భూమి ఆచంద్రుని ఉపగ్రహములను తనతోడ తీసికొనిపోగలదు; వీనితోగూడియు భూమి సూర్యునిచుట్టును ప్రదక్షిణము చేయుగల్గుచున్నది.

ఆవిధముగానే ఓ స్త్రీ పురుషులారా! ఈసూర్యులకెల్ల సూర్యుడగు భగవంతుని అంటి తిరుగుటకు మీరు దీక్షపూనితిరేని, భూమి చంద్రుని తోడ్కొనిపోవురీతిని మీరు మీ సహధర్మచారులను సయితము తోడ తీసికొని పోగలరు. మీ సహధర్మచారులను చంద్రులనుగా గ్రహించి, సూర్యులకెల్ల సూర్యుడును, జ్యోతులకెల్ల అఖండదివ్యజ్యోతిర్మూర్తియు అగు ఈశ్వరుని ప్రదక్షిణము గావించుడు. అప్పుడు ఈ క్షుద్ర

శరీరమున కొక్కదానికే ఆ సూర్యునియొక్క కాంతిని, తేజమును, ప్రకాశమును మీరు సంపాదించిపెట్టుటేగాక మీతో పాటు, మీ సహధర్మచారులకును ఆసూర్యునియొక్క కాంతిని, తేజమును, ప్రకాశమును సంపాదించి యిచ్చినట్లగును. ఈ విధముగ ఒక్కజీవాత్మను మాత్రమే దొర్లించుకొని పోవుటకు మారుగా మీరు యితరజీవాత్మలను సయితము తోడ్కొని పోజాలుదురు. కేవలము ఒక్కొక్క శరీరము ద్వారమున మాత్రమే పనిచేయుటకు మారుగా మీరు అనేకశరీరముల ద్వారమున పనిచేయగల్గుదురు. అన్నియు మీయవియే. (ఒక్కొక్క శరీరముతోవలెనే) అన్ని శరీరములతోడను భగవంతుని ప్రతిభను దాటగలరు. ఒకనరుడు తానెక్కడికైనను పోవునప్పుడు తనతో ఒక శరీరమును తీసికొనిపోవునుగదా! అతడు తలను, చేతులను, ముక్కును, కండ్లను, చెవులను వెనుక విడిచిపోవుట లేదు; అవన్నియు అతనితోడనే పోవుచున్నవి. అదేవిధముగా, ఓ నరుడా! నీవు పరతత్వజ్ఞానమును సంపాదింప బోవునప్పుడు, తత్వరహస్యమును సాక్షాత్కారమునకు తెచ్చుకొనబోవునప్పుడు నీయొక్క నగముభాగమును మాత్రమే తీసికొనిపోవుటకు మారుగా నీవు అందతెని తీసికొని పోగలవు. నీతలను, నీహృదయమును, నీచేతులను తీసికొనిపోవు విధముననే నీభార్యను నీబిడ్డలను సైతము నీవు తీసికొని పోజాలుదువు.

అటుల-భగవంతునితో నీ ఐక్యతను గ్రహించి, వానిలో నీవు ఐక్యమైపోవుటకుముందు, నీభార్యతోడను, నీబిడ్డలతోడను నీఐక్యభావమును గురించి వారితోడ ఏకీభవించుము. తనభార్యతోడను, తనబిడ్డలతోడను ఐక్యభావమును సాక్షా

త్కారమునకు తెచ్చుకొనజాలని వాడు, అల పరిపూర్ణము తోడను ఐక్యభావానుభవమును సాధింపజాలుట ఎట్లు పొసగును?

ఈ సాధనను బంధువులగు వారితోడ ఆరంభము చేయుట లెస్స అను సహజమగు మార్గమును వేదాంతము బోధించుచున్నది. నీవు మున్ముందుగ నీకు ప్రియులును హితులును అగు వారితో ఐక్యసంధానమును పొందుము. నీ బాగు నీ ఓగు వారి బాగోగులుగ మార్చుము. అందఱిశరీరములను ఒక్కటిగ పరిగణించుము; అందఱును ఒక్కప్రవాహముగ ఏర్పడు అనుభవమును సాధనముచేయుము. అటుతరువాత నీవు ఇతరకుటుంబములను చేపట్టవచ్చును; క్రమక్రమముగ ఆత్మోన్నతిని పొందుచు, అన్నికుటుంబములను నీ శరీరముగా నెంచు పరిణామమును సాధించుము. ఇటుల అన్ని శరీరములు నీయవే అను భావన స్థిరపడినప్పుడు నీవు భగవంతునితోడ ఐక్యభావమును సులభముగ పొందగలవు. నీవు ఈ రీతిని అందఱిని నీతోడ తీసికొని పోగలుదువు.

బైబులులో క్రీస్తునకు ప్రియుడయిన సెంటుజానును గూర్చి మనము చదువుచున్నాము. క్రీస్తునకు ప్రపంచము అంతటిమీదను అనురాగము గలదు. "క్రీస్తునకు ప్రియుడగు శిష్యుడు" అను మాటలు ఒకింతమార్చిన "క్రీస్తును ప్రేమించిన శిష్యుడు" అగును. అంతట క్రీస్తుద్వారమున ప్రపంచమంతయు మోక్షముపొందుట అనగా ఏమో అర్థము కాగలదు.

క్రియయు ప్రతిక్రియయు (కర్మయు దాని ఫలితమును) సమములు; పరస్పరముఅభిముఖములును (ఒకదానికొకటియెదురుగావచ్చునవి) అగును. క్రీస్తు శిష్యుని ప్రేమించిన యెడల,

ఆ శిష్యుడు క్రీస్తును ప్రేమించియుండవలయును. లేనియెడల క్రీస్తునకు వానిపై గలిగిన ప్రేమ నిలిచియుండజాలదు. కాదేని "క్రియయు ప్రతిక్రియయు సమములు, పరస్పరము అభిముఖములును" అను ధర్మమునకు భంగము కలుగును. ఆ ధర్మము అనుల్లంఘనీయము! క్రీస్తు స్థితప్రజ్ఞుడు; ఆయన జగత్పితతోడను, అఖిలజగముతోడను ఐక్యభావము పొందినవాడు. ఆయన తన మనస్సును బుద్ధిని అహంకారమును భగవంతునిలో ఐక్యసంధానము కావించినాడు.

జాను, పీటరు, పాలు అనువారును ఇంక ఇతరశిష్యులును క్రీస్తుతో బాంధవ్యము కలినవారు. వానిని ప్రేమించినవారు. [బంధుత్వము ప్రేమానురాగముల ద్వారమున కలుగుచుండును.] వీరు క్రీస్తుతోడ తాము ఐక్యభావమును పొందియే సహజముగా క్రీస్తుయొక్క దైవత్వమున పాల్గొనగల్గిరి.

విద్యుచ్ఛక్తి పూరితమయిన ఒక వస్తువు కలదనుకొనుడు. విద్యుచ్ఛక్తి పరిపూర్ణమగు వస్తువును అంటి వేఱొక వస్తువు పెట్టబడినప్పుడు, విద్యుచ్ఛక్తి రహితమగు ఈ రెండవ వస్తువుగూడ విద్యుచ్ఛక్తి పూరితమగు మొదటివస్తువునుండి ఆ శక్తిని పంచుకొనును.

ఇటులనే ఆకాలమున క్రీస్తు శిష్యులును వానిని ప్రేమించుటచేత, క్రీస్తుయొక్క స్వభావమును పాల్గొనియుండవలయును. క్రీస్తు మోక్షమును సాధించినయెడల, వానియందలి ప్రేమ [భక్తి] మూలమున యితరులును మోక్షమును పొంది తీరవలయును.

తాను సర్వప్రేమగా మారిపోనిదే బ్రహ్మసాక్షాత్కారానుభవమెవనికిని గలుగదని వేదాంతము బోధించుచున్నది. అట్టివాడు విశ్వమునంతను తన శరీరముగా భావింపవలసి యుండును. బ్రహ్మసాక్షాత్కారమునకు ఇది మొదటి సోపానము.

*అధిష్ఠానము ♦ఆరోపము అని భ్రాంతులు ద్వివిధములు. అధిష్ఠాన భ్రాంతివలన భిన్నత్వభావము గలిగి యొకవస్తువునకును మఱొక వస్తువునకును భేదము కాన్పించును. సర్వము నందును భగవంతుని చూడకుండ, ఈ అధిష్ఠానభ్రాంతి గ్రుడ్డితనమును గల్పించును. ప్రపంచమునందలి సకలమును ఏకముగా గ్రహింపకుండ చిత్తజాడ్యమును కల్పించును. ఆరోప భ్రాంతివలన బాహ్యభేద దృష్టి అనగా నామరూపాత్మకమగు భిన్నత్వభ్రాంతి చేకూరుచున్నది.

గృహస్థు డీద్వివిధభ్రాంతులను తొలగించుకొనవలసి యున్నది. అతడు మున్ముందుగా అన్ని శరీరములును ఒక్కటే అను ఆరూఢవిశ్వాసమును కుదుర్చుకొనవలయును. ఈ ద్వివిధభ్రాంతులను జయింపజూచునతడు, అందరియందుగల ఆత్మ తానే అనియు, తానే విశ్వాత్మయనియు తెలియవలెను. తన ఆత్మయే మానవకోటి అంతటి ఆత్మయని తెలిసికొనవలసియుండును. మఱియు సర్వవృక్షములయొక్కయు, సకలనదీనదములయొక్కయు, సమస్తక్రిమికీటకముల యొక్కయు, ఆత్మకూడ తానే యైయుండెనని గ్రహింపవలయును. బ్రహ్మసాక్షాత్కారానుభవమునకు ఇది ఒక మెట్టు. తన భార్యతోను తన బిడ్డలతోను ఐక్యభావమును పొందుట ప్రారంభదశ, ప్రపంచము అంతటితోను తన ఐక్యభావ

---

*ఆవరణము. ♦ విక్షేపము.

మును గ్రహించుట రెండవదశ. ఈ రెండవమెట్టు చేరినప్పుడు విక్షేపముచే కలుగు నామరూపములచే నేర్పడు భేదములన్నియును నశించును. అప్పుడే మాయ నశించి సర్వప్రపంచము తన శరీరమే అను భావముకూడ తొలగిపోవును. సర్వమును ఆత్మయందే లీనమైపోవును. "సర్వం ఖల్విదం బ్రహ్మ" అను అనుభవము చేకూరును.

చూడుడు; మొదట సర్వప్రపంచమును నా శరీరమే అను అనుభవమును కుదుర్చుకొంటిని. అంతట ప్రపంచమంతయు నా శరీరమే అను భావముగూడ తొలగి, ఆ ప్రపంచము సత్యములో (అనగా బ్రహ్మములో) అనగా నా ఆత్మలోనే లీనమైపోవుచున్నది. జ్ఞానసిద్ధి పొందినవాడు, మొదట తాను ప్రపంచముగా మారిపోయి, మఱియు ఆ ప్రపంచమును అంతటిని ఉద్ధరించును. ఈవిధముగా, నీవే నీముక్తికి దాతవగుచున్నావు అని వేదాంతముయొక్క అభిప్రాయము.

"శ్రీకృష్ణధ్యానముచే బ్రహ్మజ్ఞానము లభింపగలదు" అందురు. అనగా అర్థమేమి? మన ఆత్మయే యీ ప్రపంచమంతయు అను భావనపొంది, అనగా శ్రీకృష్ణత్వమునుపొంది మనము ఆ అఖండ పరమాత్మలో ఐక్యమందుదుము అనుటే! ఇట్లు పరతత్వజ్ఞానమును పొందుటకు పూర్వము, అనగా నిర్గుణ పరబ్రహ్మమును తెలిసికొనుటకు పూర్వము, అనగా నామ రూపాత్మకమగు విభేదము ఏమియు లేక, అనిర్వాచ్యమై వెలుంగు నిర్గుణ బ్రహ్మమును పొందుటకు పూర్వము ఈ నామరూపాత్మకమగు విశ్వమునందెల్ల ఆ బ్రహ్మము నిండి నిబిడీకృతమైయున్నట్లు ఆరూఢజ్ఞానము నీకు గలుగవలయును. దీనికే శ్రీకృష్ణప్రాప్తి అందురు. ఈ శ్రీకృష్ణత్వమును

సాధించినపిమ్మట బ్రహ్మమును పొందుట సులభము. సర్వము తోడ ఐక్యభావమును క్రమేణ సాధనచేయుటచేత నీకు శ్రీకృష్ణత్వము లభింపగలదు. ఈ సాధనయందు ప్రథమ పాఠములు, నీవు నీ తండ్రితోడను, నీతల్లితోడను, నీభార్యతోడను, నీబిడ్డలతోడను, నీస్నేహితులతోడను ఏకత్వమును అనుభవించునప్పుడు ఆరంభమగును; పిమ్మట నీ దేశ మంతటితోడి ఏకత్వభావము కుదురును. తరువాత ప్రపంచము అంతటితోడి ఏకత్వభావము అమరును. ఇట్లు యీ పాఠములు ప్రవర్ధనమగుచుండును. ఈ పాఠములు చాల కఠినముగ కాన్పించును; కాని నిజముగా అవి మిగుల కఠినమైనవి కావు. ప్రారంభము చాలకష్టమే; కాని కొంతసాగిన అనంతరము పాఠక్రమము వేగముగానే నడచును. నరుడు యింకొకనితో నేకీభావమును కుదుర్చుకొని వానియందు ఐక్యమైపోయి నట్లు భావనను అనుభవించెనేని, త్వరలోనే అతడు అందఱి తోడను ఐక్యభావమును అనుభవింపగలడు. ఈ అనుభవము వలన సర్వప్రేమ అలవడును. ఆప్రేమ మనము ప్రేమించు వస్తువును దేనిని బాహ్యమున వెలియై దూరమున ఉండ నీయనొల్లదు. బాహ్యగతమగు వర్ణము ఆకారము చందము చిహ్నము అను వీనినుండి ఆ ప్రియవస్తువును లాగివేసి, వీనికి ఆధారభూతమయి, అభ్యంతరమున వెలుంగు సత్యపదార్థము ఏదియో, ఆ ఆత్మయందే వానిని లీనముచేయును. ఇది అనుల్లంఘనీయమగు ప్రకృతిధర్మము.

ప్రతివాడును, తన అనుభవమునుబట్టి, ఈ వాక్యము సత్యమే అని ఒకింత సాక్ష్యమీయగలడు. మన వయస్సు ముదిరినకొలదిని మనము ప్రేమించు వస్తువులు సూక్ష్మతరము

లగుచుండును. మనప్రేమయొక్క లక్ష్యము క్రమక్రమముగా సహజమును, సూక్ష్మతరమును అగును. ఆలక్ష్యము క్రమక్రమముగా భావగమ్యమగును.

కొంచమో గొప్పయో యీ సత్యమును ప్రపంచములో యెల్లరును కనిపెట్టియే యుందురు. కాలము గడవగా గడవగా మనప్రియుని చూచుచున్నప్పుడు, ముఖమునందలి రేఖలుగాని, మోముతీరుగాని, ముడతలుగాని, యిట్టిబాహ్య చిహ్నములను వేనిని మనము గుర్తింపనే గుర్తింపము. అభ్యంతరమున ఉన్న ఆత్మనే మనము ప్రేమింతుము. అభ్యంతరమునఉన్న హృదయమును అనురాగమును ప్రేమింతుము; అంతర్యమున ఉండు నిర్మలతత్వమునే, ప్రేమరసమునే మనము ప్రేమింతుము. దీనిని అందరును అనుభవముచేత చూచుటలేదా? మనప్రేమ సాంద్రముగానున్నచోట బాహ్యలోపములును, శరీరవైకల్యములును మనకు కాన్పింపవని అందఱు ఎఱుంగరా? మనము మనకు హితులైనవారియందు సౌందర్యమునే చూచుచుందుముగాని, రూపవైకల్యమును గుర్తింపము. ఆ ప్రేమయందుగాని, లేక ఆవ్యక్తియందుగాని, లేక ఆప్రియవస్తువునందుగాని, నిక్కమగు అనురాగము ఉండినయెడల, మనహృదయము కఱగును; వానివైపునకు ఆకర్షింపబడును. కొంతకాలమునకు మన అనురాగలక్ష్యము సూక్ష్మతరమై, యీస్థూలములగు బాహ్యరూపములను, చిహ్నములను, రంగులను దాటిపోవును. అప్పుడు మనము ఒక పై మెట్టునకు పోయినవార మగుదుము. అంతట నీవు బాహ్యచిహ్నములను స్థూలాకారములను విడిచి, భావరసములను ఆశ్రయించినవాడవగుదువు. ఇంకను పై మెట్టు ఒకటి కలదు. అక్కడ మనప్రేమకు లక్ష్యము ఈ భావరసము

గాని, భావసగాని, శుద్ధమానసముగాని, ప్రియవస్తువులపై స్వరూపముగాని కూడకాదు; దానియందు అంతర్యామియై యున్న భగవంతుడే మనప్రేమకు లక్ష్యమగును! అప్పుడు సత్యాత్మ, అంతర్యమున వెలుంగు బ్రహ్మము మనకు గోచరమగును. ఈస్థితి సంప్రాప్తమైనప్పుడు, ఈప్రాపంచిక పదార్థములు కేవలము ప్రతిమలు, బొమ్మలుగ మారిపోవును. మనము వస్తువులను చూడక వానియందు అధివసించు ఆ అవ్యయరూపమును చూడజాలుదుము. మన దృక్కులు ఏదైన ఒక వస్తువుపైని బడినప్పుడు మన హృదయము దానియందు అంతర్గతమై వెలుగు ఆత్మను చూడగల్గును. ఈ దశ ప్రాప్తించినప్పుడు, నరుడు సులభముగా ప్రపంచమంతయును తనలో ఐక్యమైనటుల భావింపగలడు. ఇదే శ్రీకృష్ణత్వమును పడయుట! ఈదశను కొంతకాలమనుభవించిన పిమ్మట దీనిపైదశ లభించును. అప్పుడు నీవు భగవంతునిలో ఐక్యమై పోవుదువు. అప్పుడు నీవు ఒక విధమగు తన్మయత్వములో నుందువు. భగవంతుడు అనెడు సాగరమున మునిగిపోవుదువు. దానిలో లీనమై పోవుదువు. నీకును భగవంతునకును భేదమేలేకుండును. ఆ స్థితినే నిర్వాణము లేక సమాధి అందుము. అప్పుడు మనస్సు చలించదు; ఏ విధమగు తరంగములును మనసున ఉండవు; అక్కడ సంఘర్షణము అనునదియే లేదు.

ఈ ఉత్తమదశను పొందుటకు, మన ఐహిక బంధుత్వములేరీతిని క్రమానుగతముగ దారిచూపగలవో చూతము.

కొందఱు దేవుని ప్రతిమలద్వారమున పూజలుసేయుదురు. రామకృష్ణుల విగ్రహములను ఆరాధింతురు. ఒక నారీమణి ఒక మునీశ్వరుని సమీపించి, తాను గృహమును

సంసారమును విడిచి శ్రీకృష్ణలీలాక్షేత్రమగు బృందావనమున నుండుట శ్రేయోదాయకమగునా అని ప్రశ్నించినది. ఆమెకు గల బంధువులను అందఱిని విడిచి, బాంధవ్యములను అన్నింటిని ఛేదించివేసి, బృందావనములో ఏకాంతవాసము చేయుట లాభకరమా అని ప్రశ్న వేసినది.

ఆమెతోడ అప్పుడొక మనుమడుకూడ నున్నాడు. "అటుచూడుము. పరీక్షగా చూడుము. ఆ నీ మనుమని నేత్రములద్వారా నీ నేత్రములను పరికించునది యేది? ఈ బిడ్డ యొక్క తనువునందలి ప్రతి అణువును ద్వారముగ చేసికొని నీవంక చూచునట్టి ఆ శక్తి, ఆ బలము, ఆ దివ్యమహిమ ఏదియో గుర్తించుము" అని మౌని సెలవిచ్చెను. అందుకు ఆ నారీమణి "అది దేవుడే కావలయును. ఈ చిన్నబిడ్డలోపల కపటముగాని దౌష్ట్యముగాని కాన్పించదు. ఈ బిడ్డడు అమాయకుడు; నిష్కళంకుడు. ఈతడు ఏడ్చునప్పుడు ఆ విలాపము నందును భగవంతుని కంఠధ్వనితప్ప అన్యము ధ్వనించుటలేదు" అనెను. ఆ ముని మఱల యిట్లనెను: "నీవు బృందావనము పోయినప్పుడు, నీవు శ్రీకృష్ణవిగ్రహమును కౌగలించుకొందువు. అక్కడ భగవంతునియొక్క ఆ స్వరూపమున్నది! నీవు అక్కడ ఆ స్వరూపమును అర్చింతువు. సరే; ఈ బిడ్డయొక్క శరీరము ఆ బృందావనములో నీవు జూడగల విగ్రహమంత యోగ్యమైనది కాజాలదా?"

ఆ స్త్రీ కొంత విద్దూరము ననుభవించెను. కొంతవడికి తాను ఆ బిడ్డయొక్క శరీరము ద్వారముననే, ఆ బిడ్డను శ్రీకృష్ణావతారమని భావనజేసి, శ్రీకృష్ణుని పూజించగల నను జ్ఞానము ఆమెకు కలిగినది; భగవంతుడే ఆ బిడ్డయొక్క

నేత్రములద్వారమున చూచుచున్నాడు; భగవంతుడే ఆ బిడ్డ యందలి సర్వశక్తులను ఆడించుచున్నాడు. భగవంతుడే వాని చెవుల ద్వారమున వినుచున్నాడు; భగవంతుడే వాని జుట్టును ఎదుగునట్లు చేయుచున్నాడు. భగవంతుడే వాని ప్రతి అణువు నందును చరించుచున్నాడు. సర్వమును భగవంతుడే, అని ఆమె గ్రహింపగలిగెను.

ఆ మాని ఆదేశానుసారముగా ఆమె ఆ బిడ్డను తన మనుమడని తలచుట మాని, ఆతడు తనకు బంధువు అను మాటను విడిచిపెట్టి, వానిని సాక్షాత్తు భగవంతుడని భావన చేయవలసివచ్చెను. ఆవిధముగా ఆమెను సంసారబంధములును, ప్రాపంచిక బంధములును విడిపోయినవి. ఇక మిగిలియున్న సంబంధము భగవత్సంబంధమైనది ఒక్కటియే! అది వైరాగ్యమునకు త్రోవయయ్యెను.

వైరాగ్యము అనగా అన్నిటిని విడిచివేయుట కాదు. వైరాగ్యము అనగా ప్రతివస్తువును పవిత్రవంతముగా భావన చేయుట. బిడ్డనుగూర్చి వైరాగ్యము పూనుట అనగా బిడ్డతో సంబంధము అంతయువిడిచివేయుట కాదు; ఆబిడ్డను దైవముగా భావనసేయుటే వైరాగ్యము. సర్వమునందును భగవంతుని సాక్షాత్కారమునకు తెచ్చుకొనగల్గుటే పరమవైరాగ్యమని వేదాంతభావము. నీ భార్యను, నీ భర్తను, నీ బంధువులను విడిచిపెట్టుమని వేదాంతము బోధించుచున్నది. అనగా నీభార్యతో భార్య అను సంబంధమును వదలుకో, నీభార్యను భార్యగా చూడకుము; కాని ఆమెయందు అధివసించు ఆత్మ రూపుడగు భగవంతుని సాక్షాత్కారమునకు తెచ్చికొనుము

అనియే వేదాంతము బోధించును. శత్రుని శత్రువను భావముతో చూడకుము; శత్రునందు భగవంతుని మాత్రమే చూడుము. నెయ్యుని నెయ్యుడుగామాత్రము చూడకుము. నెయ్యునిద్వారా భగవంతుని భగవత్తత్వమును సాక్షాత్కారానుభవమునకు తెచ్చికొనుము. అంతటను సర్వోపగతుడగు శ్రీహరినే చూడుము.

అహంకార సంబంధములను, స్వార్థపరములగు సంబంధములను త్యజింపుము. సమస్తమునందును దేవదేవుని దివ్యకళను గుర్తించుము. భార్యాభర్తలందఱును ఇట్లుండవలయునని స్మృతుల శాసనము. ఈస్మృతుల నియామకమును అనుసరించి రామతీర్థుడు గార్హపత్యమును నడిపియున్నాడు. భార్య వేకువజాముననే మేల్కొనెడిది. రామతీర్థుడు ధ్యానాయత్తుడై భగవత్తత్వమును గుర్తించి సాక్షాత్కారమునకు తెచ్చికొని శరీరమానసములకు అతీతుడై పోయి, భగవంతునిలో ఐక్యభావమును పొందినప్పుడు, అనగా బ్రహ్మజ్ఞానామృతమును పానముచేయుచున్నతఱిని, భార్య సమీపమునకు వచ్చెడిది. భార్య రామతీర్థునిగాంచి, వాని స్థూలశరీరమును గమనించకుండ, దానియందు ఆత్మను దర్శించుట సాధనచేసెడిది. రామతీర్థుడు శరీరమును ఉపేక్షించి, భౌతికప్రపంచమును దాటిపోయి, భగవంతునియందు ఐక్యము గాంచియున్న రీతినే, వాని భార్యయు వాని శరీరమునందు భగవత్తత్వమును, భగవంతుని మాత్రమే దర్శించుచుండెడిది. అన్యమునేమియు గమనించరాదు. అందుకై రామతీర్థుని శరీరమునకు కొంత దూరమున ఆమె కూర్చుండి తనదృష్టిని వాని ముఖముమీద ఏకాగ్రము చేసెడిది. ఆమె రామతీర్థునియంత ఆత్మోన్నతి

పొందినది కాదు; కావున ఆమె యీ శరీరభావమును వెంటనే విడువజాలదయ్యెను. కావున "ఓం" అని ఉచ్చరించుచు, మనస్సు అన్యభావరహితమగువఱకును ఈ శరీరమునే తన మనస్సున ధారణచేయుచుండెను. అంతట ఆమె తన శరీరమునుకూడ మఱచెడిది. తన శరీరము రూపాంతరమంది రామతీర్థుని శరీరమందు ఐక్యమైనటుల భావనను సాధన చేసెడిది. సరే; ఆత్మగతియేమి? ఆమె తన ఆత్మయు, రామతీర్థుని ఆత్మయు ఒక్కటే అను సాక్షాత్కారానుభవమును తుదకు పొందగలిగెడిది. అట రామతీర్థుడు ధ్యానాయత్తుడయి, సమాధియవస్థయందున్నాడని భావనచేయుటకు మారుగా, తానే సమాధియవస్థలో నున్నట్లు భావించి, అటువంటి సాక్షాత్కారానుభూతిని అనుభవించెడిది. అంతట రామతీర్థుని ధ్యానము తనదేకాగా, తాను విశ్వముతో ఐక్యమైనట్లు భావించెడిది. తుదకు ఆమె తానే విశ్వాత్మయైనట్లు గ్రహించెడిది. ఈ విధముగా ఆమె రామతీర్థునకును, రామతీర్థుడు ఆమెకును పరస్పరము సహకారులుగ నైరి. ఆమె సాహాయ్యము రామతీర్థునకు ఎట్లుపకరించెను అనవచ్చును. భార్య తన భర్తను దైవముగా భావించునప్పుడు, ఆమె తన భర్తను భగవంతునిగ ఒనర్చుటకై సంకల్పించి భావనాశక్తిని ప్రసరింపజేయునుగదా? భార్యయొక్క ధ్యానశక్తియు భర్తను భగవంతునిగా నొనర్చగలదు. ఆ సాధన భర్తకుతోడ్పడి, వాని ఆత్మకు, నిజముగా పరబ్రహ్మ సాక్షాత్కారము కలుగునటుల తోడ్పడగలదు. తప్పక అట్టి సహకారము సుసాధ్యమేసుడీ!

మనము ఇంకొకని భావనలను మన యిచ్ఛానుసారముగ మార్చగలమని మానసికతత్వశాస్త్రజ్ఞులకు తెలిసినవిషయమే.

ఇక్కడ ఒకనిభార్య దివ్యసంకల్పములను ప్రసరింపు చున్నది. తనభర్త భగవంతుడే అని ధారణచేసి ఆ భావమును ప్రసరింపుచున్నది. ఆ ధ్యానము ఆత్మసాక్షాత్కారమును సంపాదించుకొనుటలో భర్తకు తోడ్పడుచున్నది. భర్త ఆత్మసాక్షాత్కారమును పొంది భార్యకు సహాయముచేయ గల్గుచున్నాడు. ఆధ్యాత్మిక దాంపత్యము అనగా ఇట్లుండ వలెను. ఇది ఉత్తమమైన దాంపత్యము! ఇరువురును పరస్పరము సహకారము సలుపుకొన గలుగుదురు. ఈరీతిని పారమార్థిక దాంపత్యమై వరలు వివాహము లోకములో అత్యంతము శుభప్రదమగును. ముఖముయొక్క రంగునుబట్టియు, మోముయొక్క తీరునుబట్టియు, ఆకారము, రూపము, అందము, చందము, ఠీవి వీనిని అనుసరించి నడచు దాంపత్యములు, దురదృష్టములును, విషాదకరములును అగును. వానివలన హృదయ భేద్యములగు దుఃఖములును, యాతనలును వాటిలగలవు.

పారమార్థికచింతతో సంధానముచేయబడిన దాంపత్యములందు ముఖపురంగు, చూపులశ్రీవి, అంద చందములు, వయ్యారములు మొదలగువానిం లక్ష్యముచేయక, అభ్యంతరమున వెలుంగు ఆత్మ తేజమునుమాత్రమే గమనింతురు. అట్టి విచారణ శుభప్రదమును శాశ్వతమునై ప్రకాశించును. అటువంటి దాంపత్యమువలనమాత్రమే ఆనందమును చేకూరగలదు.

ఒక స్త్రీ ఒక ఋషివద్దకువచ్చి "స్వామీ! నాభర్త చనిపోయినాడు. ఆయన తరించుటకై నేను ఏమిచేయవలసి యుండును?" అని ప్రశ్నించెను. ఇంకొక పెద్ద మనుష్యుడు వచ్చి తన ప్రేమైక పుత్రరత్నము పోయెను, గనుక తాను

ఆత్మహత్యను కావించుకొందునని పలికెను. పుత్రవియోగ మును భరింపలేననెను; ఇంకొకదువచ్చి తనభార్య చనిపోయె ననియు, తనకు ఇంక జీవనము వ్యర్థమనియు తెలిపెను; ఆ మానివరుడొసగిన ప్రత్యుత్తరములను గమనించుడు.

ఆస్త్రీ భర్తను ఉద్ధరించుటకు ఆతురయైయున్నది. ఆమెతో మునియిట్లనియె: నీవు తప్పక నీభర్తను రక్షించగలవు. నిరాశా యుత్తవు కాకుము. నామాటననుసరించి వర్తించుము. అనుదిన మును నీకు దుఃఖముపొంగి, నీభర్తనుగూర్చిన విచారము కలం గగానె కూర్చుండుము; కనులమూసికొనుము; నీభర్తయొక్క శరీరమును మనసా ధారణసేయుము; మన ప్రేమకు లక్ష్యమైన మూర్తి సులభముగా మన మనస్సున ప్రత్యక్షము కాగలదు. నీకు అటుల నీభర్తరూపము, అనగా ఆయనయొక్క స్థూల శరీరస్వరూపము మనస్సున ప్రత్యక్షమైనప్పుడు విచారము చెంది నెడ్వకుము. రోదనము చేయకుము. నీవు విలపించి రోదనముచేయుచు కన్నీరు కార్చితివా, నీభర్తను భూలోకమున బంధించినదానవు అగుదువు. వానిని యిక్కడ అడచిపెట్టుటచేత నీచైదము నీచమును అక్రమమును అగును. నీవు ఆతనిని క్రింద పడవేయ నెంచవలదు. వానిని అధోలోకములకు లాగిపట్ట వలదు. వాని పురోగమనము అరికట్టతగదు. నీవు నీ భర్త యున్న లోకాంతరమునుగూర్చి మననముచేయుము. ఆయన చనిపోయెనని తలంచకుము. సజీవుడై యున్నట్లు భావించుము. (కండ్లుమూసికొని ధ్యానముచేసితివా, ఆయన స్వరూపము స్ఫుటముగా నీకు గోచరము కాగలదు.) ఆ స్వరూపము సాక్షా త్కరించినప్పుడు వానిని భగవంతునిగా భావించి, ధారణ సేయుము. చిరకాలము ఇటులనే సాధనము చేయుము. "నీవు

భగవంతుడవు, దైవమే నీవు; నీవే యీశ్వరుడవు. నీ విగ్రహములోను, నీశరీరమందును, నీ ఆకారమందును దైవాంశమే నాకు కాన్పించుచున్నది." అని వానితో పలుకుము; వానికి ఈభావమును బోధించుము; సతతము ఈ సంకల్పమునే వానియెదుట నుంచుము.

దూరశ్రవణ యంత్రమును తీసికొని, చెవిదాపున పెట్టుకొనినప్పుడు మనకు ధ్వని వినవచ్చును. ఆధ్వని యంత్రమున ఉద్భవమగుట లేదని మనము ఎఱుఁగుదుము. అది దూరమున అదృశ్యుడై యున్న ఒకమిత్రుని యొద్దనుండి వచ్చుచున్న దని తెలియును. అదేవిధముగా నీవు పరలోక గతుడయిన నీ భర్తయొక్క రూపమును కాంచునప్పుడు, ఆ రూపమునకు వెనుక దైవాంశ కలదని గ్రహించుము. "నీవు దైవమవు; నీవు భగవంతుడవు" అని దానితో అనుము. ఈమార్గమును అవలంబించితివేని నీభర్తను ఉద్ధరించగలవు. తక్కినవారికిని ఈబోధయే గ్రాహ్యము! మంచిది. లోకాంతరగతులయిన మిత్రులను ఉద్ధరించి, సహకారము సలుపగలిగినప్పుడు, ఆ సాధననే అవలంబించి సజీవులయి యున్నవారిని గూడ రక్షించి ఉద్ధరించగలము.

కావున భార్యాభర్తలు ఈరీతినిజీవించిరేని, వారి దాంపత్యము ఆత్మోన్నతికి అర్హమైనదై, పరస్పరము ఆనందదాయకముగా నుండగలదు.. భర్తయెల్లెడల భార్యకు ఆనందము కూర్పవలయునని, ఆమె కోరినదెల్ల నొసంగ నభిలషించుచునే యుండును. అజ్ఞానవశమున పలిజలు తాము సరియైన త్రోవనే నడచుచుంటి మనుకొందురు. భార్య కోరుదానికెల్ల భర్తయు, భర్త కోరువానికెల్ల భార్యయు భళీ అనుచు వర్తించి

నంతనే ముదము చేకూర్చుకొన గలమని యెంచుచుందురు. అది పొసగదు! ఆమార్గము నవలంబించి, మీరు అధోగతిని పడి యితరులనుకూడ అధోగతికి త్రోయుచుందురు. నాకు ఆనందమును కూర్చునది నీకును ఆనందమును సమకూర్పవల యును; నాకు శ్రేయోదాయకము అగునది నీకును అట్లే కావలయును; నేనున్నతికి పోయినచో నీవును ఉన్నతికి రాగలవు. నా పురోగమనమే నీ పురోగమనమును అగును. లోకమునంతను రోగపీడితము చేయకుండ నీవు జబ్బుపడ జాలవు. నీ శరీరమును ఆరోగ్యముగా ఉంచుకొనుటలో నీవు ప్రపంచమును అంతటిని ఆరోగ్యవంతముగ ఒనర్పగలవు. క్రియా ప్రతిక్రియలు సమానములును అభిముఖములును నై నడచుచుండును.

నేను నిన్ను సంతోషపెట్టుదునని నేనును సంతోష మును పొందవలయును. కావున ఒండొరులు కోరినదానినెల్ల ఒసగుకొనుటవలన సౌఖ్యము అబ్బునని ప్రజలు భ్రమింపు చుందురు, అట్లెన్నడును పొసగుటలేదు. దానివలన అసహ్యా భావమును దుఃఖమును మాత్రమే కలుగుచున్నవి. అట్టివర్త నమువలన ఉభయపక్షముల వారికిని బాధలే కలుగుచుండును. ఇరుపక్షములవారును అసంతృప్తులై యే యుండి దుఃఖముల పాలగుచుందురు. వారి హృదయములు దిగులుతోను భయము తోను నిండుచుండును.

ఒకరినొకరు సౌఖ్యపెట్టుట ఎటులనో తెలియని అజ్ఞా నమువలననే యీభయము ఈదుఃఖము కలుగుచున్నవి! మీరు ఒకరినొకరు సంతోషపెట్టుకొన నెంచితిరేని మమత్వపూరితమైన నీ సంకుచితాత్మను వికాసము నొందచేయుము. అందుకు నీ

ప్రియురాలియొక్క సత్యస్వరూపమగు ఆత్మను నీవు ముందుగ గ్రహించవలయును. దానికి గొప్పబలము నొసగవలయును; అప్పుడు మఱల గొప్పబలము అక్కడినుండి ప్రతిఫలించగలదు. అందుకు మీరు ఒండొరులకు విజ్ఞానదానము గావించుకొనుచుండవలయును. అటుల గావించితిరా మీప్రియులను ఆనందపఱచి మీరును ఆనందమును పొందగలరు. నీవు నిజమగు హితాభిలాషివే యైనచో, సత్యమగు ఆనందమునొసగజాలు వస్తువులనే దానము చేయవలసి యుండును. అవి ఏవన విజ్ఞానమును, ఆధ్యాత్మికవిముక్తియునై యున్నవి. వీనిని నీ హితులకొసగుము. భార్యకు విద్యగఱపుట భర్తకువిధియై యున్నది. భార్యకు ఉపదేశకుడు కాజాలనిభర్తయు, భర్తకు ఆత్మోన్నతిని కల్పించి, విద్యగఱపి విజ్ఞానమును పారమార్థిక మోక్షమును ఒసగజాలని భార్యయు జీవితమున సుఖమును అనుభవింపజాలరు. భార్య పాపియైనచో ఆ భార్యయొక్క జ్ఞానాభివృద్ధికి గాను స్వగృహమును సద్విద్యాలయముగా నొనర్పజాలని భర్తయు పాపియేయగుచున్నాడు. పరస్పరము సౌఖ్యమును ఒనగూర్చుకొనుటకు ఇదే సత్యమైన మార్గము.

మీ సంతానము పవిత్రవంతమైనది కాగోరితిరేని, మీసంతానమునుండి క్రీస్తులు కృష్ణులు రావలయునని అభిలషింతురేని, మీ బిడ్డలు లోకకల్యాణ సంధాయకులు కావలయునని సంకల్పించితిరేని, మీహృదయములను పరమపవిత్రవంతములుగ చేయుడు. భార్యాభర్తలు తుచ్ఛభోగములకు లోబడక సదా భగవద్భక్తులయి వర్తించుచు, భగవత్కృపాపూరితులై, సర్వాత్మయందు మగ్నమైన జీవితముల

గడవవలయును. భార్యాభర్తలిరువురును విజ్ఞానమున నిమగ్నులై యుండిరేని వారి పావనజీవితమహిమ, వారి ఉన్నతభావములు, వారిపవిత్రసంకల్పములు వారి సంతానమునందు ప్రతిఫలింపక తప్పవు. అటువంటివారి సంతానమునుండియే క్రీస్తులు, మహామ్మదులు, బుద్ధులు, కృష్ణులు, బయలుదేరగలరు.

గృహముఅనునది ప్రేమక్షేత్రమునకు కేంద్రము(నడిమిబొడ్డు)గా ఉండవలయును గాని, ఆవరణ(చుట్టు హద్దుగోడ)గా ఉండ తగదు. ప్రజలు సాధారణముగా గృహమును తమ అనురాగమునకు హద్దుగానొనర్చి తమ ప్రేమను ఆహద్దుదాటిపోనీయరు. గృహిణియు గృహములు కేంద్రస్థానమై అచ్చటనుండి అనురాగకిరణములు దశదిశలకును ప్రసరించుచుండవలయును. నీప్రేమను అంతటిని అందే బంధించిఉంచతగవు. నీప్రేమానురాగములకు నీభార్య ఆవరణ గోడగా ఏర్పడరాదు. నీస్వార్థభోగ సంకల్పములచేత నీభార్యను అధోగతిని పడవేసి, నీవు తుచ్ఛుడవై పోవ, యిరువురును భ్రష్టులగుచున్నారు. నీభార్య నీకుప్రేమను నేర్పును. ఆ ప్రేమను నీవు పవిత్రవంతముగ నొనర్చవలయును. ఆ ప్రేమను విశ్వాశరణ్యముగనొనర్చి దానిని నీభార్యయొక్క రూపము, రంగు, విలాసము, మొదలగు హద్దులను దాటించవలయును. ఆ ప్రేమ పరిపూర్ణమును దివ్యమును అయి ప్రకాశించునటులచేయుము. అటువంటి ప్రేమైక దృక్కులతో నీవు సమస్తమును దర్శించితివేని, గడ్డిపోచలను, చిన్నపూవులను, నదులను, గుట్టలను, కొండలను అడవులను అన్నింటిని సర్వప్రేమతో చూడజాలితివేని, నీవు ప్రపంచము అంతటితోడను ఐక్యము కాగల్గుదువు!

నీభార్య ప్రపంచములో నీస్థానమేదియో నీకు తెలువవలయునేగాని, ప్రపంచమునుండి నిన్ను వెలిగా ఉద్ధ్వతగదు. పారమార్థికధర్మములను కొన్నింటిని విచారింతము. ఇయ్యవి ప్రపంచములోని అనురాగ లతలను అన్నింటిని సవరణచేయగలవు. మీరు ఈ ధర్మములను అనువర్తించుచునే యున్నారు; ఇకముందును అటులనే జరుగగలదు. కాని మీరు ఆ ధర్మముల తత్త్వమును తెలిసి మెలుగుటలేదు. మీరు ఆరహస్యములను తెలిసికొంటిరేని ముందుగ జాగ్రత్త పడగలరు. లేనియెడల రథముతోలునతడు మార్గమధ్యమున రాయియున్నదని యెఱుంగక దానిమీదుగా చక్రమును నడిపి దెబ్బతినురీతిని భంగపడవచ్చును. ఆసంగతిని ముందుగ నెఱింగినేని ఆతడు ముందుగ జాగ్రత్తపడి ఆరాతిని తప్పించుకొని పోగలడు. అటులనే ప్రాపంచిక యాత్రయందు ఎదురుదెబ్బలు తినుటయు, పడుటయు, దుఃఖము నొందుటలు సంప్రాప్తించుచుండును. సరియే, ఈ దుఃఖములు, ఈ దెబ్బలు, ఈ తలక్రిందులగుటలు ఎప్పుడువచ్చునని జాగ్రత్తపడగలము? అని ప్రశ్నింతురేని రామతీర్థుడు ఆ సంగతిని వివరించును. మీరు దానిని జక్కగ గమనించి అపాయములనుండి తొలగుదురుగాక. మార్గము కేవలము దుర్గమముకాదు. సాధ్యమైనంతవఱకు మీరు అవరోధములు కలుగకుండనే పోగలరు.

స్త్రీగాని పురుషుడుగాని ప్రత్యేకము ఒకరూపమునో, ఒక శరీరమునో, ఒక పదార్థమునో ప్రేమించును అనుకొందము. ఆవస్తువును ఉపయోగించుటకు కొంతకాలము లభించి, ఆవస్తువు హృదయమున స్థిరాసనమును నెలకొలువుకొనును, అది సర్వస్వము తోచును. తోడనే, ఆవస్తువు తొలగిచనును. ఇది

న్నైజధర్మము, ఈ లోకములో దీని తప్పించుకొను మార్గము లేదు. ఇట్టి సంఘటనమును తప్పించునట్టిగాని, రాకుండ ఆపునట్టిగాని శక్తి యెందునులేదు. యుగయుగములనుండి నేటివఱకును యీ ధర్మము అవిచ్ఛిన్నముగ సాగివచ్చుచున్నది.

ఏబాహ్యవస్తువునందో మక్కువపూనుము; ఏ నామరూపములనో ఆశ్రయింపుము; ఏఘనునో ఆధారముచేసికొనుము; వానిని నమ్మికొనుము; వానిపైని ఒరగియుండుము; ఆ ఊతకఱ్ఱ విధిగా తొలగిపోక తీరదుసుమీ! అప్పుడు నీవు తప్పక అధోగతి గూలుదువు. ఒకబల్లపైని ఊతగొని నిలుచువాడు, అది తొలగింపగానే, పడిపోవలసినవాడే; దెబ్బతినవలసినవాడే. దీనినిబట్టి మనము నేర్చుకొనవలసినదేమి? మన అనురాగము ఇటువంటి అశాశ్వత స్థూలజడ పదార్థములపైని ఆధారపడియుండుట తప్పు! ఈస్థూలజడ వస్తుజాలము మన అనురాగములకు గురి కాదగదు. అయినను ఈ వస్తుజాలము ద్వారమున తప్ప మనహృదయములందు అనురాగము ఉత్పన్నమే కాకున్నది! వీని ద్వారమున మాత్రమే మనము ప్రేమను నేర్చుకొన్నాము. మఱియు మనము ప్రేమను నేర్చుకొనుట తోడనే, ఆప్రేమను ఆవస్తువునందే బంధించియుంచుట దోషమని ప్రకృతి ఘోషిల్లుచుండును. ఆ ప్రేమ పురోవృద్ధి కాంచవలయును; ఉన్నతావస్థలను పొందవలయును. అది భగవత్సాన్నిధ్యమునకు చేరవలసియున్నది. భార్య ఆధారముగా ప్రేమపాఠములను నేర్చినవాడు ఆ ప్రేమను భగవంతునికై త్రిప్పక విడుచునో, అతనికి భంగపాటు తప్పదు. అటుల ప్రేమను ఉన్నతికి తీసికొనిరాక ఉపేక్షింతువేని నీకు దుఃఖము తప్పదు. భార్యాభర్తలు ఇరువురును కలసి ఆత్మోన్నతిని

గాంచవలసి యున్నారు. భార్యవలన ప్రేమ అనుదానిని నేర్చి ఆ ప్రేమను ఒక శరీరమునందే నిలుపతగదు. దానిని సర్వ వ్యాపిగా నొనర్చవలయును. ఆ ప్రేమను జగమంతట వ్యాపింప జేయవలయును.

ఐహికసుఖక్షేత్రమునందు నాటిన బీజమునుండి పార మార్థికోన్నతి అంకురించుటలేదు. ప్రేమబీజము భార్యాభర్తల శరీరములందు నాటబడి, భౌతిక శరీరములందు నాటబడిన అ ప్రేమబీజము నేలలో లోతుగ పాతి పూడ్చిపెట్టబడినట్లు అగుచున్నది. ఆ ప్రేమబీజము శిథిలమై, మొలకయెత్తి, పై కెదిగి ఫలము నిచ్చునెడల మంచిదే. భార్యయందో, భర్త యందో, లేక యే భౌతికపదార్థమునందో నాటబడిన బీజము శిథిలము కావలసినదే కాని; అందుండి చెట్టు పైకివచ్చి ఫల ములను ఈయవలయును. ప్రాపంచిక వస్తువులమీది ప్రేమ సత తము వ్యర్థమైపోయినట్లు అగపడవచ్చును. కాని బీజము నశించి నప్పుడు ఆ బీజమునుండియే ఫలము కలుగునటుల, ఈ ప్రేమ బీజమేయొకప్పుడు నీకు బ్రహ్మ సాక్షాత్కారమును లభింప జేయగలదు. ఇది ప్రకృతిధర్మము. ఎన్నడును ప్రేమ నెఱుంగని వాడు భగవంతుని సాక్షాత్కారమునకు తెచ్చుకొననే లేడు. ఇది సత్యము.

సామాన్యముగా మతమునకును ప్రాపంచిక ప్రేమకును సంబంధములేదని కొందఱు బోధింపుచుందురు. అది సరిగాదు. సంబంధమధికముగానున్నది. సక్రమగతిని నడచిన అనురా గము బ్రహ్మసాక్షాత్కారము నొసగగలదు "అన్యసుఖము లకై పాటుపడుటవ్యర్థము" నిర్మలమగు ప్రేమయే బ్రహ్మ

సాక్షాత్కారమును ప్రసాదింపగలదు. ప్రేమ భగవంతుని స్వరూపమే.

వివాహ సంబంధమును పవిత్రము కావించుటే భర్త యొక్క గమ్యమైయుండవలయును. కాని ధనార్జనమును సాంసారిక బాంధవ్యములను వక్రమార్గమున వినియోగించుటకు కారణము కాదగదు. సుఖసాధనములగు వస్తుజాలమునే పరమ గమ్యములుగ నెంచి దుఃఖమును తెచ్చిపెట్టుకొనుచున్నాము. సాధనములనే గమ్యములుగా భ్రమింపదగదు. ధనసంపదలు నీ చలిబాధను తొలగించుటకును, నీ ఆకలిదప్పులను తీర్చుటకును నీకై ఒకనిలయమును ఒసగుటకును మాత్రమే వినియోగపడవలయును. ఇట్లు నీ ఆకలి దప్పులు తీర్చుటకును నీకు చలి బాధ లేకుండ వస్త్రములను ఒసగుటకును ఎంత స్వల్పధనము సరిపోవునో యోచించుకొనుము.

ప్రజలు 'నాకు పడిసెము పట్టినది' అందురు. పడిసెము వారిని పట్టుకొనుటలేదు. వారే వెదకి వెదకి అజాడ్యమును పట్టుకొనుచున్నారు. జలుబు చేయకుండుటకు నీవుదుస్తులను ధరించవలయుననుట నిజమే. అవినీకు జలుబుచేయకుండకాచు నంతటివిగ మాత్రమే ఉండవలయును. ఆమస్తులు సొగసైనవి కాకపోవచ్చును; చౌకవిగా నుండవచ్చును; మిక్కిలి విలువగలవిగానుండ నక్కఱలేదు. మనము చిన్నయిండ్లలో నుండగలము. కండ్లకు మిరుమిట్లు గొలుపునట్టి మేడలు అగత్యములేదు. పశువుల బాధయు అన్యజనుల బాధయు రాకుండ కాచునంతటి సామాన్యపుయిండ్లు మనకున్న చాలును. సుందరములైన మేడల యావశ్యకత లేదు.

నరులు ఈనాడు తమ మేడల సౌందర్యమును, విభవ మును పరమ లక్ష్యముగ చూచుచున్నారు. వస్త్రముల మెఱుంగులు మఱొకలక్ష్యము. పళ్ళెరముల నిండు భక్ష్య భోజ్యముల బాహుళ్యమే ప్రధానలక్ష్యముగ నెంచుచున్నారు. అవి మన లక్ష్యములుగానుండతగవు. సాధనామాత్రములుగనే ఉండదగును.

ప్రపంచ చరిత్రను పరిశీలించినచో కొన్నిజాతులవారు కుటీరములలోను, చిన్నయిండ్లలోను వాసము చేసిరని తెలియ గలము. వారి వస్త్రములును ఆహారమును బీదలు సేవించు నవిగనేయుండెను. అయినను గూడ వారు లోకైకవీరులని ప్రసిద్ధి కాంచగల్గిరి. అటుల బీదలై బ్రతికినవారు లోకములో మహా ఘనకార్యముల నొనర్పగల్గిరి. మహోత్కృష్ట గ్రంథముల రచింపగల్గిరి. మనఋషులెల్లరును ఆకలలములదిని పర్ణశాలలలో అడవులందున్నవారు కారా! జగమును వెలుగుపడజేయు వేదాంతశాస్త్రమును, మోక్షసిద్ధాంతమును, భక్తితత్వమును బోధింపజాలి యుండిరిగదా!

మీరు ఘనులును సజ్జనులును అగుటకు ప్రయత్నిం చుడు. సుందర భవనములను కట్టుటకై మీశక్తియుక్తులను వృథావ్యయము కావించకుడు. మనలో చాలమందికి విశాల రమ్య హర్మ్యములుగలవు; కాని అందు అధివసించు వారలు అల్పులు. మన దేశములో చాల గొప్ప సమాధులు గలవు; వానియందున్న దేమి? క్రుళ్ళి శిథిలమైయున్న శల్యములును, క్రిమిజాలములే, గదా!

నీభార్యను, నీబిడ్డలను, నీబంధువులను, నీమిత్రులను పెద్ద పెద్ద మేడలతోడను వింతవింత సామగ్రితోను గారవించుట

చేత ఘనులనుగ నొనర్పయత్నింపకుము. నీవు దీనిని జక్కగ గ్రహించుము. సద్బుద్ధిగలిగుము. నీశక్తియుక్తులను వ్యర్థపుచ్చి, సంపదలను గడించుట నీజీవితగమ్యార్థముగాదని యెఱుంగుము. నీవు సుజ్ఞానమును గలిగుటయు, మోక్షమును సాధించుటయు, భగవంతుడ వగుటయు నీపరమలక్ష్యమని తెలియుము. దీనిని గ్రహించి నీశక్తియుక్తులను సద్వినియోగము జేసితివా, నీ సంసారబాంధవ్యములు నీకు సంకటములుగా నుండవు.

"మేమైతే నిరాడంబర జీవితములనే గడపగలము, కాని మా అతిథులను గారవించుటో, కుండ, చట్టి పెట్టుకొనియుంటే వారేమనుకొందురు?" అని ప్రజలు వాదించుచుందురు.

మిత్రమా! నీవు నీకొఱకా యితరులకొఱకా జీవించుట? నీకొఱకే నీవు జీవింపుము! ఇతరులకు నీజీవితముతో జోక్యము లేదు. నీవు ఆహారమును తినునప్పుడు ఆ తినునది నీవా? ఇతరులా? నీయాహారమును నీవు జీర్ణించుకొందువా? ఇతరులు నీకై ఆహారమును జీర్ణించిపెట్టుదురా? నీవు చూచునప్పుడు, నీ నేత్రములా పనిచేయునది, యితరులవా? నీమట్టుకు నీవు సిలకడ చూచుకొనుము; స్వతంత్రముగ నిలుచుశక్తిని పొందుము. నీవెన్నెముకను బలపఱచుకొనుము; నిన్ను చూడవచ్చువారి అభిప్రాయములను అవలంబించుము. అతిథిసత్కారధర్మమును నీవు పెట్టు తిండిలోను, పండుకొనబెట్టు పరుపులలోను దూర్చకుము. తమకు మంచితిండి, మెత్తనిపక్క అమర్చనియెడల అతిథిసత్కారము చక్కగ జరుగలేదని ప్రజలు అనుకొనుచుందురు. అందుచేత గృహస్థులు గృహములకు దాసులగుట

తటస్థించుచున్నది. మీరు అటుల గృహములకు దాసులు కాకుడు. మీగృహసంపదలను మీకై యేర్పడిన వినియోగ పదార్థములనుగానొనర్చుకొనుడు. దీనిని బక్కగ గ్రహించుడు.

మీయింటికి ఒక అతిథివచ్చినయెడల, అతడు నీయిల్లువిడచు నపుడు విజ్ఞానవంతుడై ఉన్నతభావ కలితుడై, ఉద్ధరింపబడిన వాడై వెళ్ళునటుల చూడుము. వచ్చినప్పటికంటె వెళ్ళునప్పుడు ఎక్కువ జ్ఞానముతో వెడలవలయును. నీ సోదరమానవుల యెడ నీవు ఈధర్మమును నిర్వహించుము. నీగృహమును శుభ ప్రదముగనొనర్చుటకిదొక మార్గము. గృహస్థునకు వాని గృహము మార్గమునకడ్డుదగులునదిగా నుండుటకు మారుగా పైకిపోనిచ్చు సోపానమైయొప్పునటుల చేయుటకిదొక యుపా యము. నీ అతిథి నీకడకు వచ్చినప్పటికంటె వెడలునప్పుడు విజ్ఞానవంతుడై వెళ్ళునెడల నీవు వానికి పెట్టిన భోజనమును గూర్చియు, వానిని పరుండబెట్టిన పడకను గూర్చియు నీవు విచారింప నక్కరలేదు. ఉత్తమమయిన జ్ఞానమును ఒసగి పంపుము. నీప్రేమను వానికి పంచియిమ్ము. అతను నీకుఒక్క దమ్మిడినైన నీయజాలకున్నను నీదేహమునకు ఎట్టి ఉపచార మును కావించకున్నను, సత్యానురాగపూరితమును, నిష్క ళంకమును అగు చిరునగవు ఒసగినయెడల అది నిన్నుద్ధరించ గలదు. నీకు ఆనందమును గొలుపగలదు. అతను చాల సుకృతి నొనర్చినట్లెఅగును. ధనదానము చేయుట అధమము. అది భార్యకు ధనమునొసగి వివాహబంధమును త్రెంచుకొనుట వంటిది. భార్యకు కావలసినది ధనముకాదు, అనురాగమునుడీ! నీవు ఒకనికి ధనము నిచ్చుటవలన ద్రోహివి అగుదువు.

నీవు వానిని మోసగించుచుంటివి అన్నమాటయేసుమీ! వానికి నీప్రేమను, జ్ఞానమును ఒసగుము. వానిని సుజ్ఞాన కలితుని చేయుము. అతనికి ఆత్మోన్నతిని ఒసగుము. నీవు చూపవలసిన ఉత్తమ అతిథిసత్కారము ఇదిసుమీ! నీభార్యయెడలను, బిడ్డలయెడలను నీవు చూపవలసిన ప్రేమయిట్టువంటిదిగానే ఉండవలయును!! ఇట్టి పరమ పవిత్రప్రేమ సాధనమే గృహస్థాశ్రమతత్వము!!!

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.



# అనుబంధము.



## I

సులోచనములు కంటికి భారములుకావు; చూపునకు అడ్డుతగులవు. మఱియు దృష్టికితోడ్పడి, వస్తువుల స్వరూపమును విస్పష్టముగ జూపును. భార్య భర్తకును, భర్త భార్యకును సులోచనముల తీరున ఉపయోగపడవలయును. ఒకరు మరొకరికి భారముగ తోచతగదు. ఒకరికొకరు అడ్డుకాకూడదు. మఱియు జీవితగమ్యార్థమును గుర్తించుటకును, జన్మతరించుటకును ఒకరికొకరు సాహాయ్యపడవలయును. భార్యాభర్తల సాహచర్యము పారమార్థికతేజమును ప్రకాశమునకు తెచ్చుసాధనముగ నుపకరించవలయును. వ్యష్టిభావములు, అభిరుచులు, ఆచారవ్యవహారములు, అలవాటులు వారి ఆధ్యాత్మిక జీవనమునకు అవరోధములు కాతగవు.

మనశ్శ్వాస మనకు బాధకరముగ నుండతగదు. అది నిరాటంకముగ శరీరమున చొచ్చుచుపోవుచు నుండవలయును. ఆరోగ్యమును కూర్చవలయును; అనారోగ్యమును తొలగించవలయును. అదేవిధముగా వైవాహికసంబంధ ధర్మములు భార్యాభర్తలయెడ నిరాఘాటముగ సాగునవై యుండవలయును. భార్యాభర్తలు ఒండొరులకు ఉత్తేజమును కూర్చుకొనుచు, అజ్ఞానమును తొలగించుకొనుచు, పరస్పరము ఉపకృతుల నల్పుకొనుచు మెలగవలయును. దాంపత్యచర్య పీడాకరముగను బంధనహేతువుగనునుండరాదు. కంటికి పెట్టుకొను కాటుక

గాని, సుర్మాగాని దృష్టికి అడ్డురాకూడదుగదా? కంటిలోపడి మెఱమెఱలాడుచు బాధ కలుగచేయతగదు. అటులనే ఆలుమగలు ఒకరిదృష్టికొకరు తేటకూర్చవలయునేగాని, మసకలుక్రమ్మజేసియు సంక్షుభితముజేసియు బాధించరాదు. ఒండొరులదాపున మెలగుచు, వారు ప్రపంచముపైని దృష్టిపఱచునప్పుడు, ఆ ప్రపంచపు మాయతొలగి యథార్థస్వరూపము గోచరించవలయును. బిడ్డలను, చుట్టాలను స్నేహితులనుచూపి సత్యజ్ఞానమును అలవఱచు దివ్యాంజనమువలె వర్తించవలయును.

'నేను మీకు జ్ఞప్తియందు ఉందునా' అని ఒక స్త్రీ తనభర్తను ప్రశ్నించినది. 'లేదు నిన్ను నేను యెన్నడును జ్ఞప్తియందుంచు కొనజూడను' అని భర్తపలికెను. భార్య ఒకింత చకితురాలైనది. వెలవెలబోయినది. అప్పుడు భర్త "ఓసీ! నీముక్కు నీకు జ్ఞప్తిలోనుండునా" నీకన్ను నీకు జ్ఞప్తిలోనుండునా? అటులనే నీవు నాకు జ్ఞప్తిలోనుండవు. నీఅవయవములలో నేదేని బాధనొందెనా? అది నీవు వలదన్నను నీకు జ్ఞప్తిలోనుండును. అటులనే నీవు ప్రేమచే నాయర్థాంగివైయుండగా, నీవు నాకు జ్ఞప్తిలో నెందుకుండవలయును? నీవు ప్రతికూలవై బాధాకరముగ తోచినప్పుడు వలదనుకొన్నను నిన్ను జ్ఞప్తిలో పెట్టుకొనకతీరదు. నీవు నన్ను అనువర్తింపుచు, సానుభూతితో మెలగుచుండగా, నిన్ను వేఱుగ తలంచి జ్ఞప్తిలోనుంచుకొననేల? నీవు నాలో నైక్యసంధానమైయుందువు.' అని బోధించి ఆమె సంశయమును బాపినాడు.

స్నేహితునికడనుండి మనకు ఒకఉత్తరమువచ్చినయెడల దానిని ఎంతయో మక్కువతో చూతుము. అయినను ఆయాద

రణకు కారణము ఆ కాగితముకాదు. దానిని వ్రాసిపంపిన స్నేహితుని యెడ మనకుగల ప్రేమయే యిందు ప్రధానమైనది. అటులనే భార్యాభర్తలు మెలగవలయును. వారి శరీరములు ఉత్తరములవంటివి. వానిని రచించిన వాడు భగవంతుడు సుమీ. భర్తశరీరమునందు భార్యకును, భార్య శరీరమునందు భర్తకును, భగవంతుని సందేశము గోచరించవలసియుండును. ఆ సందేశమును పంపు సర్వేశ్వరుని బట్టి, వారి తనువులు ప్రేమానురాగములకు పాత్రములు కావలెనేగాని, ఉత్తరపుకాగితమువలెనే తమంతట తాము, అనగా ఒండొరుల శరీరములు స్వయముగా, ప్రేమకు గురికాజాలవు.

ఇటుల భార్యాభర్తల ప్రేమభావములు పవిత్రభూతములుకాగా, క్రమేణ వారిదృష్టి విశాలతరమగును. భావములు ఉన్నతిగాంచును. విశ్వమంతయు భార్యయందు మూర్తీభవించి భర్తకును, భర్తయందు మూర్తీభవించి భార్యకును గోచరించవలయును. ఒండొరులు తమయందు సర్వేశ్వరుని ప్రతిబింబములనే చూచుకొనవలయును. అప్పుడు వారి సంతానము నరరూపముదాల్చిన పరమార్థికతయు పవిత్రప్రేమరాశియునై ప్రకాశించును. భార్య భార్య అను గారణమువలనగాక, ఆమెయందు అభివ్యక్తమగు ఆత్మతేజమువలనను, భర్త భర్త అగు కారణమువలనగాక, వానియందు అభివ్యక్తమగు ఆత్మతేజమువలనను ప్రేమార్హమగుచుండు. వివాహకాలమున వధూవరులను లక్ష్మీనారాయణుని భావనజేసి పాటలుపాడుట, మంత్రాలుచదువుట యిందుకొఱకే. వివాహధర్మము యిటుల కేవలము పారమార్థికమే యగుచున్నది.



# II

ప్రతి గృహస్థుడును, గృహస్థాశ్రమమున ప్రవేశింప బోవు ప్రతి యువకుడును సదా జ్ఞప్తినుంచుకొనవలసిన అంశములు కొన్ని యీ క్రింద వ్రాయబడుచున్నవి.

ప్రతినరుడును భగవద్ధ్యానపరుడై యుండి పరబ్రహ్మ విషయికజ్ఞానమునే జీవితపరమావధిగ నెంచవలయును. ఎన్నెన్ని గ్రంథముల చదివినను, ఏయే విషయముల నేర్చినను ఏయే సమర్థతల గడించినను, ఎన్నెన్ని ఉద్యోగములను నిర్వర్తించినను సర్వమును తాను తరించు సాధనములుగ మాత్రమే యుండవలయును.

ఈలోకములో భార్య, సంతానము, అతిథి, అభ్యాగతి, తల్లి, తండ్రి, స్నేహితుడు, సేవకుడు మొదలగు అందఱి యెడలను తన విధులను సమగ్రముగ నిరంతరము నెఱవేర్చుచు, తాను ఆచరించు సర్వకార్యములను ఈశ్వరార్పితములుగ జేయవలయును.

ఏవానికుపకారముజేసినను, వాని రూపమున ప్రత్యక్షమైన భగవంతునకే నీవు సేవజేసినటుల భావింపవలయును. అప్పుడు వాని కృతజ్ఞతగాని కృతఘ్నతగాని నీవిచారణకే రాదు. ఎంతటి ఘనకార్యములును నీవు కావించినను అవియెల్ల భగవదర్పిత సేవలేగాన కీర్తిప్రతిష్ఠలకై యెదురుచూడతగదు.

నీ సర్వసంపదలును, ధనముగాని, క్షేత్రములుగాని, బంధుకోటిగాని, స్నేహబృందముగాని, బుద్ధివిశేషముగాని, శారీరక సమర్థతగాని, సమస్తమును సాధుసేవకొఱకును,

దీనరక్షణకొఱకును భగవంతుడు నీకిచ్చెనని విశ్వసింపుము వాని వినియోగమునుగూర్చి నీవు భగవంతునికి సమాధానము జెప్పవలసియుందువు. భగవంతుని సేవకుడవుగా వానిని విని యోగము చేయుచు వర్తించునప్పుడు నీకు అత్యంతము అవ సరమగునంతవరకు వానిని నీవును అనుభవించుటకు అధి కార ముండును. భోగలాలసతచేత హెచ్చుగ అనుభవించినను, లోభముచేత దాచిపెట్టుకొనినను, నిర్లక్ష్యముచేత దుర్వి నియోగము చేసినను నీవు అపచారము చేసినవాడ వగుదువు. గృహస్థుడు తప్ప తక్కిన మూడాశ్రమములవారును ధనార్జ నము చేయతగదు. వీరిని పోషించు బాధ్యత గృహస్థునిదే అగుచున్నది.

పెద్దలయెడ పరమపూజ్యభావము కలిగియుండవల యును. వారియెదుట పరిహాసములు ఆడదగదు. ఆగ్రహ మును ఉద్రేకమును చూపరాదు. గురువునకును తలిదండ్రు లకును అనుదినమును నమస్కారము జేయవలయును.

భార్యను భర్తయు, భర్తను భార్యయు ఆధ్యాత్మిక జీవ యాత్రయందుతోడుగవచ్చు యాత్రికురాలుగను యాత్రికుడు గను భావించి ఒండొరుల పారమార్థిక పరిణామమేగమ్యముగ నెంచవలయును. ఇంద్రియ భోగములకై ఒక్కసంసారముగ కూడితిమని యెన్నడును భావింపతగదు.

సంతానముగనుట లోకసేవ కొఱకగు పవిత్రధర్మ ముగ నెంచవలయును. దుష్టసంతానమును కనుట మహా పాపము. తండ్రి మరణించునప్పుడు కుమారునితో 'నాచేత నేర్పబడిన వేదములను నీవు పఠింపుము; నాచేత చేయబడుచు వచ్చిన సత్కర్మలను నీవు నిర్వహింపుము; నాచే సంపాదింప

బడిన సంపదవు నీవుకమ్ము.' అని పలుకగా కుమారుడు వానిని అన్నిటిని నెరవేర్చునటుల ప్రమాణము జేయవలయునని మన శాస్త్రములు విధింపుచున్నది. దీనింబట్టి సంతానమునకు ఉద్దేశమేమొ స్పష్టపడగలదు. కామోపశాంతికి ఫలముగా సంతానమును కనుట మానవునకు అర్హకృత్యముకాదు. అది కడుదూష్యము.

ఇంద్రియనిగ్రహము సర్వవిధముల నరునికి ముఖ్యధర్మము. సత్సంతాన ప్రాప్తికొఱకు తప్ప భార్యాభర్తలు సంయోగ మొనర్పదగదు. ఇద్దఱు ముగ్గురు బిడ్డలు పుట్టిన అనంతరము భార్యాభర్తలు సోదరీసోదరులవలె వర్తింపుచు, బ్రహ్మచర్య దీక్షను పూనవలయును. భార్యాభర్తలు యేకశయ్యను పరుండ తగదు. వేర్వేఱు గదులందు శయనించుట శ్రేష్ఠము.

కామోద్రేకమునకు కారణములగు భావములను నీదఱిసి రానీకుము. అటువంటి భావములకు మూలములగు మాటలను వినకుము. అట్టి పుస్తకముల జదువకుము. అట్టి నాటకములను సినిమాలను చూడకుము. కామోద్రేకము కల్గినప్పుడెల్ల చన్నీటిలో స్నానముజేయుము. నీ శీలమును పవిత్రవంతముజేసి బల పఱచు సుబోధలను వినుము. అట్టి పుస్తకములనే జదువుము. అట్టి నాటకాదులనే చూడుము. శీలనిర్మాణము తప్ప నీ జీవితమున నీకు గమ్యార్థమే లేదు.

బీదసాదలయెడ కరుణను అలవఱచుకొనుము. త్యాగమును సాధనజేయుము. స్వార్థమును దూరముగ నుంచుము. ఆశాపాశములే నిన్ను పిఱికివానిగ జేయునని నమ్ముము. సుఖలాలసయు, కష్టమునందు అయిష్టమును విడిచితివా నీకు యెంతయు ధీరత సమకూరగలదు.

ధర్మపరాయణత స్వార్థపరులకు చిక్కదు. ధర్మనిర్వహణమునకు ధైర్యము అవసరము. కష్టములకు వెఱచువాడు ధర్మమును అంటిపట్టి యుండజాలడు.

ఏ కార్యము జేసినను స్వబుద్ధిని ప్రమాణముగ జేసికొనుము. పెద్దలుగాని, శాస్త్రముగాని విధించు కార్యమును చేయుటకు నీవు ఒడంబడినప్పుడు, ఆ ఒడంబడికచేత అది నీబుద్ధియొక్క నిర్ణయమే అయ్యెనని తలంచుము. అటులనే నీవుయెవరి ప్రోత్సాహముచేత దుష్కార్యము జేసినను, అది నీబుద్ధియొక్క నిర్ణయమును బడసిన పిమ్మటనే జరిగినదిగను, దానికి నీవే బాధ్యుడవుగను యెంచుము! బాధ్యతను యితరులపైని పడవేయజూడకుము.

నీబాధ్యతను చక్కగ నిర్వహించుటకు నీ జ్ఞానమును బలపఱచుకొనుచుండవలయును. నీజ్ఞానము పెరిగిన కొలదిని నీ అంతరాత్మ బలపడుచుండును. నీ ఆత్మతేజము ప్రకాశమునకు వచ్చుచుండును. ఎంతసద్భావముతో నీవు యితరులకు విధేయుడవై నడచుచున్నను, వారెంత ఘనులైనను కూడ, నీ స్వయంనిర్ణయము అందు లేదేని నీ బాధ్యత ఉపేక్షింపబడుచున్నటుల గ్రహించుము.

ఏ విషయమైనను ధర్మమా కాదా అను విచారణ మీదనే నిర్ణయము కావలయునుగాని, నీకు లాభదాయకమా కాదా అను చింతకు అవకాశముండతగదు. లాభనష్టములు అప్రధానములు. లాభనష్టముల చింతయే కామము. కేవలధర్మచింతయే వైరాగ్యము. విషయములందు లాభాపేక్షను చొనుపుటే మోహము. ఆ మోహమును త్రెంచుటే వైరాగ్యము. విషయములంగూర్చి అజ్ఞానముతో వర్తింపక

విడుచుటే వైరాగ్యముగాని, లోపల ఆశ పీడించుచుండగా విషయములందు వర్తింపక విడిచినను వైరాగ్యముకాదు.

అజ్ఞానముతో గూడిన ప్రేమ మోహము. జ్ఞానము గలిగి, పేరాశలు వీడి, యెన్నివ్యవహారముల కావించుచున్నను వైరాగ్యమునకు భంగమురాదు. విరాగిఅగుటకు సంసారమును విడువ నవసరములేదు. లోకవ్యవహారములను త్యజించుఆవశ్యకతయు లేదు. వానింగూర్చిన మోహమువిడిచి అందేవర్తింప వచ్చును. సుఖాభిలాష లాభచింత కష్టభీతి మోహమునకు మూలకందములును, వైరాగ్యనాశకరములును అగునేగాని కేవల వ్యవహారములందు గుణదోషము లుండవు.

ఇతరుల కష్టార్జితమును వారియిష్టముతోడ చమత్కారముగా సంగ్రహించినను, దౌర్జన్యమున లాగికొనినను దోషమే! అందుమూలమున ఋణగ్రస్తత యేర్పడుచున్నది. సమానముగు ప్రతిఫలమునొసగక యెవరివలనను దేనిని నంగీకరింపతగదు. యిచ్చువాడు సర్వత్ర ధన్యుడు. పుచ్చుకొనువాడు సర్వత్ర భ్రష్టుడే.

అన్నదానము, ద్రవ్యదానము, కన్యాదానము, విద్యాదానము, పరమార్థజ్ఞాన దానము ఉత్తరోత్తరము ఘనతరములు.

కేవలము జాలితలచి దానము చేయరాదు. దానము పొందువానికి నీవుయిచ్చునది క్షేమకరముగ నుండవలయును. దానముచేయుశక్తియుండి, అవసరము కలిగినప్పుడు ఉపేక్షించువాడు పాతకి అగును. చోరుడే అనదగును.

గృహస్థునికి జ్ఞానార్జనము మొదటివిధి; ద్రవ్యార్జనము రెండవది; వానిని సద్వినియోగము చేయుట మూడవది. ఈ

విధులను ఉల్లంఘించు గృహస్థుడు తాను చెడి, తనవలనపోషణ పొందవలసినవారిని ఎందఱినో నష్టపఱచిన పాపమును పొందును.

కృషిచేయుట గృహస్థుని ముఖ్యధర్మము. ఏ గృహస్థుడు తనదేశముకొఱకు, సంఘముకొఱకు, దైవముకొఱకు, ధర్మముకొఱకు ప్రాణములనైనను ఒగ్గి పాటుపడునో అతడు మహాతపస్సంపన్నుడగు యోగి బడయు సద్గతిని పొందగలడు.

అన్నికర్మములును, విధులును, వృత్తులును సమానములే. హెచ్చుతగ్గులనునవి వానిని నిర్వహించు విధమువలనను, వానియందు ప్రవేశపెట్టు భావమువలనను గలుగుచుండును. చక్కగ వీధులను ఊడ్చుపాకీవాడును, ధర్మముగపరిపాలనము చేయు రాజును భగవంతుని దృష్టిలో సమానులే. దుర్వినీతుడును, ఉదాసీనుడునగు చక్రవర్తి భక్తిశ్రద్ధలతో ఊడిగము చేయు దాసికన్న నికృష్టుడనుట సత్యము.

ఎవడు యేవృత్తికర్హుడో, అది వానికి స్వధర్మము అగును. స్వధర్మము శ్రేయస్కరము. స్వధర్మభంగకరమగు పరధర్మము ఎంత బాగుగ నిర్వర్తింపబడినను అనర్థదాయకమేయగును. స్వధర్మము విడుచుట సర్వత్ర పాపహేతువగును.

పారమార్థికతను అభిలషించు గృహస్థులు అనుదినమును ఏదోయొకపరోపకారకార్యమును నిర్వహింపుచుండవలయును. లోభమును, యింద్రియ లాలసను జయించుటకు ఇదిఒక ఉపాయము. శరీరస్పృహను మఱచుటకు యిది ఒక సాధనయగును.

మనస్సు సాధారణముగా నూతనమార్గములను నడుచుటకును, నూతన సాధనలను అవలంబించుటకును పూనిక చూపదు. కాబట్టిప్రతిదినమును ఒక యేకాంతస్థలము నేర్పఱచు

కొని అచ్చట కొంతకాలము భగవద్ధ్యానము జేయుట అలవఱచుకొనవలయును. మొదట ఇది బహు కష్టసాధ్యముగ నుండును. దీర్ఘకాలమునకేని దీనివలన శాంతియు, ఆనందమును లభింపగలవు. అనేక దుఃఖసమయములందు ఈ అభ్యాసము లాభప్రదమగును.

సాధుసంగమున తఱచుగా కాలము గడుపుట మంచిది. మొట్టమొదట దానివలన ప్రతిఫలము అంతగా గోచరించదు. కాని ఈ అభ్యాసమువలన భక్తిశ్రద్ధలును, ధర్మనిరతియు మనకు తెలియకుండనే మన హృదయములందు పాదుకొని ప్రవర్ధనము కాంచగలవు. అయినను నిజమగు సాధువులను కనిపెట్టి వారి సహవాసమునకు గడంగవలయును.

సంసారమునందు లిప్తులుగాక మెలంగవలయును. బిడ్డలు బంధువులు నావారే యను మమకారమును, మోహమును పూనదగదు. వారెల్ల జగన్నాథుని సంతానమనియు, నీవు వారిసేవకై నియమింపబడితివనియు భావన జేయవలయును. దేవునికి యిచ్ఛయున్నంతకాలము నిన్ను వారి సేవాసహవాసములందు ఆనందమును పడయనిచ్చును. తదుపరి వారిసన్నికడనుండి తొలగించును. లేదా నిన్ను వారికడనుండి తొలగించును. నీవు తల్లివైనను, తండ్రివైనను, సదా మెలకువతో ఇట్టి సంఘట్టనమునకు సంసిద్ధముగ నుండినయెడల, నిన్ను దుఃఖములు అలముకొనవు. బంధునాశముగాని, సంతానసష్టముగాని నిన్ను వివశునిజేసి శోకమున ముంచజాలదు.

సకలమును ఈశ్వరుని నిర్ణయమునకు విడిచి సర్వత్రి ఆనందమును శాంతిని పడయజూతుము.

---

# శ్రీ సద్గురు మలయాళస్వాములవారి గ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| 1. | శ్రీ శుష్కవేదాంత తమోభాస్కరము | ... | 3_0_0 |
| 2. | శ్రీస్వబోధసుధాకరము | ... | 1_8_0 |
| 3. | ఓంకారము (ప్రణవోపాసన) | ... | 1_4_0 |
| 4. | ప్రశ్నోత్తర మాణిక్యమాల | ... | 2_0_0 |
| 5. | స్తోత్రమఞ్జరీ | ... | 0_8_0 |
| 6. | గీతాశయము | ... | 0_10_0 |
| 7. | ధర్మసేతువు | ... | 4_0_0 |
| 8. | ఉపదేశామృతము (ప్రథమభాగము) | ... | 0_8_0 |
| 9. | డిటో (ద్వితీయభాగము) | ... | 0_10_0 |
| 10. | డిటో (తృతీయభాగము) | ... | 1_8_0 |
| 11. | సాధుదర్శనము | ... | 0_4_0 |
| 12. | శ్రీవేంకటేశాది పూజాపంచరత్నమాల | ... | 0_12_0 |
| 13. | ధ్యానామృతము | ... | 0_8_0 |
| 14. | సుప్రబోధము | ... | 0_4_0 |
| 15 | సాంఖ్యయోగము | ... | 0_4_0 |
| 16. | యథార్థభారతి, చిన్నపొత్తము | ... | 0_2_0 |
| 17. | ఓంకారపటము | ... | 0_4_0 |
| 18. | శ్రీభగవద్గీత 1. మూలము, 2. పదవిభాగము, 3. ప్రతిపదార్థము, 4. తాత్పర్యము 5. విశేషార్థములతో కూడినది. | | 6_0_0 |
| 19 | ,, మూలము, తాత్పర్యముతో కూడినది | | 2_0_0 |
| 20. | శ్రీభగవద్గీత మూలము | ... | 0_10_0 |
| 21. | శ్రీబాలయోగిని | ... | 4_8_0 |
| 22. | లోకోద్ధారకము | ... | 4_0_0 |
| 23. | ఈశ్వరకృప | ... | 6_0_0 |
| 24. | బ్రహ్మవిద్య | ... | 0_12_0 |
| 25. | సన్న్యాసయోగము | ... | 1_2_0 |
| 26. | యజ్ఞము | ... | 0_8_0 |
| 27. | పాతంజల యోగదర్శనము | ... | 5_0_0 |
| 28. | మాయను మాయము చేయుట | ... | 0_12_0 |

---

వలయువారు ఈ క్రిందివిలాసమునకు వ్రాసి తెప్పించుకొనవచ్చును:—

శ్రీవ్యాసాశ్రమము, ఏర్పేడుపోస్టు, (చిత్తూరు జిల్లా.)

# శ్రీ యోగవాసిష్ఠము.

ఈ మహాగ్రంథము ఇదివరకు తెనుగులో సంపూర్ణముగా ముద్రించియుండలేదు. 32000 శ్లోకములుగలదు. శ్రీవసిష్ఠ మునీంద్రులు శ్రీరామచంద్రులకొఱకుపదేశించిన సమస్తవేదాంత సారగర్భితములగు యుపదేశవచనములతో గూడియున్నది. ఇది 6 ప్రకరణములతో గూడినది. త్రేతాయుగమున శ్రీ రామచంద్రులకు వసిష్ఠ మునీంద్రుడుపదేశించిన నీ మహోన్నతగ్రంథమును ఇదివరకాంధ్రానువాదము నెవరు చేసియుండలేదు. ఇది సంపూర్ణముగానిప్పుడు వ్యాసాశ్రమముతరపున శ్లోక తాత్పర్యములతో ముద్రించడమైనది. ఇది పూర్వార్ధమనియు, ఉత్తరార్ధమనియు రెండుభాగములు.

పూర్వార్ధము రెండు సంపుటములు. వెల రు. 20-0-0

ఉత్తరార్ధమున్ను ,, ,, 25-0-0

తెప్పించువారు రైల్వేమార్గముగా తెప్పించిన చార్జిచాలతగ్గిపోవును. ఎవ్వరైన పూర్వార్ధము రెండు వాల్యూములున్ను, ఉత్తరార్ధము రెండు వాల్యూములున్ను, లేక నాలుగు వాల్యూములున్ను ఒకేమారి కొనవలసినదేగాని, ఒక్కొక్క వాల్యూము ప్రత్యేకముగా నివ్వబడదు.

## శ్రీ మహాభగవద్గీత.

### (గీతార్థదీపికా సహితము)

ఈ గ్రంథమున శ్రీశంకరాచార్య స్వాములవారున్ను, వారి అనుయాయులగు (1) శ్రీశంకరానంద, శ్రీమధుసూదన సరస్వతి, (3) శ్రీధర, (4) శ్రీ ఆనందగిరిస్వాములు మొదలయినవారి భాష్యసారములున్ను, శ్రీరామానుజాచార్య స్వాములవారున్ను, వారి అనుయాయులగు శ్రీవేదాంత దేశికాచార్యులవారి భాష్యసారమున్ను, శ్రీమధ్వాచార్య స్వాములున్ను, వారి యనుయాయులగు శ్రీరాఘవేన్ద్రస్వాములవారి భాష్యసారమున్ను చూడగలరు.

దీనిని ఘనమయిన ఇంగ్లీషు కాగితములో రాయల్ సైజులో ముద్రించి మంచి క్యాలికో బైండు చేయబడినది. [దీనివెల రు. 14-0-0]

# యథార్థభారతి. ఆధ్యాత్మిక విద్యావిషయిక మాసపత్రిక.

చందా. సం॥ 1-కి రూ. 4—0—0.

ఏ యాధ్యాత్మిక జ్ఞానము వేదఋషులచే దెలుపబడెనో, ఏజ్ఞానము ఖండాంతరములచే నాదరింపబడెనో, యేజ్ఞానము బంధవిమోచనకారియో యాజ్ఞానము తెలుపుటకే యీ పత్రిక వెల్వడెను. ఈ పత్రిక నాదరించుట యనగా మీ పూర్వఋషుల పవిత్రభావము పెంచుటయని మీకే తెలియును. దీనియందు ఉపనిషత్సారము, అనేక మహాత్ముల తత్త్వోపదేశము మొదలగునవి ముద్రింపబడును.

## ముక్తిసోపానదినచర్య.

ఇది డైరీరూపముగానుండును. యెప్పుడుకొనినను ఆ తేదీ నుండి సంవత్సరము పూర్తిగా 365 రోజులకు ఒక్కొక్క పేజీచొప్పున ఏర్పాటుచేయుడమైనది. భక్తి,జ్ఞాన, వైరాగ్యసారమును దెలిపెడు శ్లోకమున్ను, తాత్పర్యమున్ను ప్రతిపేజీలోనుండును. క్రింద దిన చర్యవ్రాయుటకు కొంతకాగితము మిగిలియుండును. క్రింద దిన చర్యను, అనుభవమును వ్రాసుకొనవచ్చును. వెల 1–10–0

## జ్ఞానోదయడైరి.

ఇది పైజెప్పినవిధముగా 365 రోజులలో తనయనుభవమును దినచర్యను వ్రాసుకొనవచ్చును. ఎప్పుడుకొనినను ఆ తేదీ నుండి సంవత్సరాంత్యము వరకు వ్రాసేలాగున చేయుడమైనది. ఒక్కొక్కపేజీలోను శ్రీబుద్ధ, శ్రీ యేసుక్రీస్తు, శ్రీ మహమ్మదునబీ, శ్రీ శంకర, శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీవివేకానంద, శ్రీరామతీర్థులు మొదలగువారి దివ్యోపదేశములతో గూడియున్నది. [వెల రూ. 1–8–0

---

వలయువారు— మేనేజరు, శ్రీ వ్యాసాశ్రమము,
ఏర్పేడు పోస్టు, (చిత్తూరుజిల్లా.)

BC

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA107B180 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 67 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Haseema |
| పేజీలు విడదీసినది | HASEEMA |
| స్కాన్ చేసినది | PRATHYUSHA |
| పరీక్ష చేసినది | SANDHYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | NO |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |